# BATHUKUPATAM

Poems writtent by

**Siddenky Yadagiri**



Cover Design : Ramana GV

First Edition : 2014

Copies: 500

Price: 80/-

Library Fees: 100/-

Publication:

**Daruvu Prachuranalu**

For Copies:

***Siddenky Punya (Lavanya)***

**W/o. Yadagiri**

Vill&Post: Gonepally, Mdl: Chinnakodur

Dist: Medak, 502 267.

Cell: 9441244773, 8341884448

sygiri773@gmail.com

sygiri773@ rediffmaal.com

and All Book shopes

# అక్షరాలే జీవితమైన కవి

అక్షరం జీవితాల్నే మార్చివేస్తది. కొన్ని అక్షరాలే కోట్లమంది భవిష్యత్తును పునర్లికిస్తయి. చితికిపోయి ఉసూరుమంటున్న బతుకులో కొత్త చైతన్యాన్ని ఊదుతయి. అక్షరం విస్తరించి చరిత్ర చలనశక్తిలో జాతికి జాజ్వల్యమానమైన తేజస్సును ప్రసరిస్తది. అక్షరం నశించదు. తలవంచదు. ఎక్కడైనా దానికి తిరుగులేదు. అక్షరం దు:ఖించే హ్రుదయాన్ని ఊరడిస్తది. ఒంటరి ఒత్తిడికి ముచ్చటపెట్టి మురిపిస్తది. కొండశిఖరాలు అధిగమించే ధైర్యసాహసాలు నూరిపోస్తది. అక్షరం అనుభవం. తరాల్ని అల్లే అనుబంధం. విశ్వాన్ని అందుకునే ఆలోచన.

వీరుల సంఘర్షణా, తత్వవేత్తల అన్వేషణా, కవుల ప్రయాణం అక్షరాల తల్లి ఒడిలో నేర్చుకొని మంచి తనం పంచడానికి అక్షరాన్ని నమ్ముకొని 'మాతొవ్వ' గా మొలకెత్తి – బతుకుపాఠం గా కలమెత్తి చిగురిస్తున్న కవి సిద్దెంకి యాదగిరి. కవనంలో జనం బాధను మేనిపెస్టోగా ప్రకటించుకొని బయలెల్లిండు. 'అక్షరానికి దూరంచేయబడిన ప్రాంతం నుంచి, ఊరినుంచి,అక్షరం సోకనివ్వని కుటుంబమునుంచి,వాడనుంచి కట్టు దాటి ఇక్కట్లు దాటి కవిత్వం అందుకోవడం చిన్న విషయమేమీ కాదు అక్షరంతోనే ప్రారంభించటంవిజయమే విప్లవ సంకల్పమే.

అసమానతల పై అక్షరాల పంజా ఎత్తి
అజ్ఞానంపై అక్షరదాడి చేయడానికి చైతన్యం పంపుతున్న
ఆత్మీయతాక్షరాలై చదువురానోల్లను అల్లుకుంట
చదివెటోల్ల సారమై జవాబిస్త
ఉదయం లేచింది మొదలు
ఊపిరున్నంత వరకు అక్షరాలే జీవితం (అక్షరాలా జీవితం)

అందరు డబ్బును ప్రేమిస్తుంటే యాదగిరి అక్షరాల్ని ప్రేమించిండు. అక్షరాలతోనే జీవిస్తనని ప్రకటించుకున్నడు.

కవిత్వాన్ని సాధనంగా పూని మార్పు వైపు అడుగులు వేస్తున్నడు.

పునాదులు గొపురాలు కట్టినం

పూజలు చేయనివ్వని పంచాంగం పగ

తంతెల నాటి నుంచి గుడితంతెలు ఎక్కలే

గుండంల మునగనియ్యని గండం

గురుతు పెట్టుకొని గురుతు పెట్టాలే (కులగర్వం)

అణచివేత ప్రధానంగా సాగేది పెత్తందారీ వర్గం అగ్రవర్ణం.పునాదులు తవ్వే దగ్గర, గుడికట్టే దగ్గర పనికొచ్చిన మనుషులు ప్రవేశం దగ్గర, పూజదగ్గర పనికి రారని కట్టడి చేయడం కేవలం- ఆధిపత్యం కోసమే. తరతరాలనుంచీ అదే అణచివేత.అందరు మనుషులే అయినా,అందరికి దేవుడే అయినా కొందరిని దూరం చేయటం దుర్నీతి.

అక్షరం దగ్గరా దుర్నీతి ఆలయందగ్గరా దుర్నీతే.తంతేల ఏర్పాటు దురన్యాయం. ఎన్నింటి దగ్గరో సాగినవాల్లు విధించిన కట్టడి సామాజిక అసమానత. చరిత్ర పోడుగుతా,పొడుగుతా చోటుచేసుకున్న రకరకాల అసమానతల మీద కవి సమరం.

ఒకటే బాణం- ఒకటే మాట-ఒకతే బార్య

మోసపు మాటలు

సరసపురాంద్రు సంఖ్యకు మించి

అవసరాన్ని బట్టి అవతారం మంచిదే (మారిపోతున్నాను)

అవసరాలను బట్టి ఆదర్శాలు మారిపోవటం చిత్రం గదా. కవి యదగిరి వ్యంగ చిత్రమిదే. ఒక అవతారంలో ఒక ఆదర్శం బోధిస్తే ఎట్లా? దేవునికి అవతారాలుంటాయిగని, మనిషికి ఒకటే జీవితం మరి. ఏ ఆదర్శం పాటించాలే? వాటి వెనుక ఉన్న మాయను అధిక్షేపిస్తున్నడు కవి. పాతపురణాలు ఒక రకమైన మోసం చేస్తే అణిచి వేస్తే, ఆధునిక యంత్రాలు అంతకు మించి అన్యాయాన్ని కెత్తుకున్నయి. వినోదం పంచటానికి వచ్చిన పరికరం మనుషుల మెదళ్ళమీద మాయ పెత్తనం చెస్తున్నది. సరుకుల సంస్కృతిని మరుగు పరుస్తున్నది.స్ధానిక చైతన్యమున్న యాదగిరి కవి హృదయంతో టీవి తమాషాలు చిత్రించిండు.

కదిలే బొమ్మల పెట్టె
ఎప్పుడైతే ఇంట్లోకొచ్చి కదలకుంట కూసున్నదో
గప్పట్నుంచే మా ఆటపాటల మీదదాడి చేస్తూ
మనసు పొరలను మాయంచేస్తుంది. (జాండకాడ్కి రాంద్రి)

కనబడకుండా కబళించే తత్వం టీవీది. క్రమక్రమంగా మనసు పొరలను కమ్ముకుంటూ ఆటపాటలను దూరం చేస్తది.జీవితం నుంచి పుట్టీ జీవితం చుట్టూ అల్లుకున్న ఆటలను, పాటలను తప్పించి ఏ సంబంధమూ లేని ఏఅనుబంధాలూ లేని వ్యామోహాలను చొప్పిస్తున్న తీరును కవి వర్ణించిండు. కదిలే బొమ్మల పెట్టె, కదలకుంట కూసోవటం వ్యక్తీకరణ కవి నైపుణ్యానికి నిదర్శనం.

సోయి ఉన్న కవి కోల్పోతున్న దేమిటో గడిచిన కాలపు తీపి జ్ఞాపకాల్ని నెమరు వేసుకుంటడు.ఏఆట,ఏపాట,ఏమాట,ఏప్రేమ ఎంత మధురమో యాదికి తెచ్చుకొని ప్రేరణ పొందుతడు యాదగిరి.ఏదీ తూచలేనిది అవ్వ. ఏదీ తీర్చలేనిది అవ్వ ప్రేమ.

కోరి కోరి తెచ్చిన తినుబండారాల చిరు బాండాగారం
పొర్లుతున్న దుఃఖానికి
అడ్డుకట్ట వేసి ఓదర్చుతుంటది
భారం బరించలేనప్పుడు మెత్తటి సుట్టబట్ట
..............
ఊపే విసన కర్ర.......నిద్రకు మెత్త
మా బతుకు తీరు అంతా మా అవ్వకొంగుతోనే
రెపరెలాడుతున్న జండాను చూసినా
కండ్ల నిండ మా అవ్వకొంగే కనబడ్తది. (మా అవ్వకొంగు)

తెలుగే అయినా అవ్వ అనటానికి ప్రేమ కావాలే. ఎంతో కొంత ధైర్యం కావాలె.అణచివేతల్లో 'భాష' అణిచివేతకూడా ఒకటి. యాదగిరి ఎట్ల పిలుస్తడో అట్ల రాయదలుచుకున్నడు. 'అవ్వ' కొంగునే వర్ణించదలుచుకున్నడు. 'లేమి' తనపు 'ప్రేమ' అదే. అవ్వకొంగు ఆప్యాయత, అవసరాన్ని బట్టి రూపాంతరం చెందుతది. ఉన్న

జీవితానికి ప్రతి అవసరానికి ఒకో వస్తువు. లేని 'తనపు' కొంగుకు ఎన్ని కోణాలు, ఎన్ని రూపాలు అన్నింటిని అద్భుతంగా చిత్రించిండు గిరి. కవి దృష్టికి జాతీయ పతాకంలో అవ్వకొంగే కనబడ్డది.

ఏ కవికైనా అవ్వ తరువాత ఊరు ప్రేరణ. తెలంగాణల ఊరంటే బతుకమ్మ. తెలంగాణ సాంస్కృతికోద్యమంలో "బతుకమ్మ" కొత్త వైభవం సంతరించుకుంది. అందరి బతుకు అమ్మ అయ్యింది.

చప్పట్లలో గాజుల నాదమై గొంతెత్తిన రాగానికి
కోకిలలు కోరస్ అవ్వాలని కోరుకుంటయి.
దప్పుసప్పుళ్ల సాగుతున్న ర్యాలీని చూసే ప్రకృతి పరవశించి పోతది.
ప్రపంచంల పూలను పూజించే పద్ధతి ఎక్కడ లేదనీ
జొన్న తలలొంచి దండం పెడుతుంటే
పునాస కొత్త తోరణాలతో ఆహ్వానిస్తుంటది.

జాతి పునరుజ్జీవనోద్యమంలో దేవులాట మొదలయితది. తన ఉన్నతిని తనుచాటుకొనే ప్రయత్నంలో కొత్త ఆవిష్కరణలు మొలకెత్తుతయి ప్రజలు జీవ సమానంగా ప్రేమించిన సన్నివేషాలు కవిని ఉద్వేగపరుస్తయి. తెలంగణ రాష్ట్ర ఆకాంక్ష కవికి సడలని నిరంతర దీక్ష ఉద్యమానికి కవి అక్షరం ఆయుధమైంది. పదం నినాదమైంది.

ఇంటికో మనిషి చేతులో జెండా
తెలంగాణ సంకెళ్ళు తెంచడానికి సడుస్తున్నం
త్యాగాల తిలకం దిద్దుకొని
అమర వీరుల ఆశయాల్ని ఆలపిస్తూ
ఆశల ఖడ్గాన్ని ఆలోచనల కిరీటాన్ని ధరిస్తున్నం
తెలంగాణ మార్చ్‌కు కదులుతున్నం

తెలంగాణ స్వప్నం సాకారమవుతున్న దశలు పునర్నిర్మాణం మిగిలేఉంటది. వలసాంధ్ర పెత్తనం అంతరించినా ఇతర ఆధిపత్యాలు మిగిలే ఉంటయి.అసమానతలను పెంచి పోషంచే అసమసమాజం సాగురనే ఉంటది.వీటన్నిటి మీద అక్షర యుద్ధం చెయ్యటానికి కవి సిద్ధంగా ఉంటడు. అసమానతలతో తలపడటానికి సిద్దెంకి యాదగిరి సిద్ధంగా ఉన్నడు.

ఇప్పటికే హక్కుల చైతన్యం (హక్కుల కవచం)తో బాలగోపాల్ నివాళి అనేక కవితల్లో ప్రతిఫలించిన (విశ్వమానవ విపంచి)తో జాషువా నివాళి, వర్గీకరణ ఉద్యమ సందర్భం (దండోర)లో, ప్రపంచీకరణ  పరిణామాలు (మారిపోతున్నాను), ఉద్యోగ ఉద్యమాలు (సమ్మెపోటు). తెలంగాణ ఉద్యమం (లైఫ్‌లాంగ్ మార్చ్)అన్నా హజారే దాకా.....ఇట్లా అన్ని చలనాల చైతన్యం పొదుగుకున్న కవి సిద్దెంకి గిరి రాబోయే కాలంలో మరింత బాధ్యతగా మరింత శక్తివంతంగా అక్షరాలు సంధించగలడని సంపూర్ణ విశ్వాసం కలిగిస్తున్నడు. మానవ వనంలో అలజడి దర్శించడం తెలుసు. ఒత్తిడిని తట్టుకొని అవమానాల్ని గెలవగల స్థిర సంకల్పం తెలుసు. రాలిన తారల కాంతితో వేల ఇంద్ర ధనుస్సులు వెలగించే ఉద్యమం గుర్తు, అక్షర కణాల్ని పిడికిట్లో బంధించి భూమ్మీద వెదజల్లే కవిత్వం గుర్తు.

చరిత్ర బోధించడమే కాదు
చరిత్ర మార్చటం
పాఠం చెప్పడమే కాదు
గుణపాఠం చెప్పటం
మేలుకోవడం మేలుకొల్పడం ఏలుకోవటం తెల్సు.

సిద్దెంకి యాదగిరి కవిత్వాన్ని అభినందిస్తున్నాను. అక్షరంతో ఉద్యమంలో నిరంతరం వికసించాలని ఆశిస్తున్నాను.

**నందిని సిధారెడ్డి**

08 జనవరి 2014
సిద్దిపేట.

# మా దరువుకు పరువు, నిత్యాన్వేషి సిద్దెంకి యాదగిరన్న

స్నేహం...కొంతమందికి ధైర్యం, మరికొంత మందికి ఓ తీపి జ్ఞాపకం మరి మాకు..నిత్యం ఆశయాల్ని మోసుకెల్తూ సాగిపోతున్న జోడెడ్లబండి, ఒకటి లేకుంటే మరొకటి నడ్వది, నడిపించే శక్తి ఉన్నా... నడువడానికి మనుసొప్పది. ఒకదానికి కాలుగఱ్ఱవడ్తే...మరొకటి కన్నీరువెడ్తది..జోడేడ్ల స్నేహం...అనుభవించేటోళ్ళకే అర్థమయితది. ఆగోస అసొంటిది మా స్నేహం...మా దరువు సురువైకాన్నుంచి దరువుకు పరువు దెచ్చిండు సిద్దెంకి యాదగిరన్న.

సిద్దెంకి యాదన్న పుట్టింది గోనెపల్లి ఊర్లో, చిన్నకోడూరు మండలం, మెదక్ జిల్లాలో, గోనెపల్లి సిద్ధిపేట పక్కన ఓ చిన్న పల్లెటూరు, తల్లిదండ్రులకు ఏకైక సంతానం యాదన్న... ఒక్కడే కావడం వల్ల గావురంగా సాదుకున్నరు. పొర్లాయిదాకి అడ్డంబడితే ఇసుకరాల్లు మోకాల్లకు గీసి నెత్తురు కారుతుంటే...తల్లడిల్లీ నల్లాలంబెట్టి తనువంత నిమిరే తల్లిదండ్రుల ప్రేమ. అవ్వయ్యలతో కల్సి తిరిగిన కొడుకు-కుటుంబం-సమాజం-రైతులు-ప్రభుత్వాలు, సదువుకుంటున్న రోజుల్లోనే అర్థంచేసుకున్నడు. ఇంటికాడ నుల్క మంచం మీద గూసొని అల్లుకున్న కవిత్వం, అలలు అలలుగా పొర్లిన ఆలోచనలు, ఇయ్యల మనముందుకు ఇలా పుస్తకరూపంలో రావడానికి కారణమైనయ్.

యాదన్నది "పెద్ద మనసు-పసిపిలగాని మనస్సు" కలగలిసిన నిష్కల్మషమైన వ్యక్తిత్వం. సిద్ధిపేట డిగ్రీ కళాశాలలో మేము డిగ్రీలో సోపతిగాల్లం ఒకే గూటి పక్షులం కావడం వల్ల మేము కలవడం తొందరగనే జరిగింది. 1999 డిసెంబర్ 20న దరువు పురుడుబోసుకున్నది. అణగారిన వర్గాల సాహిత్య, సాంస్కృతిక, వారసత్వ సంపదను కాపాడుకొనేందుకు ఆత్మగౌరవ ఆయుధంగా మలచడంకోసం ఏర్పడిందే "దరువు" దరువు ఏర్పాటులో సిద్దెంకి యాదగిరన్నది కీలకమైన పాత్ర. నడిపించడంలో పాత్ర. సిద్దెంకి యాదన్ననే లేకపోతే...మీ ఆలోచనలు ఇంతపదునెక్కేవి కావు. ఇంత తెగారం ఉండేదికాదు. ఎప్పటికప్పుడు ధైర్యాన్ని నూరిపోసే కవిత్వం మమ్మల్ని

నడిపించింది...ఇప్పటికి నడిపిస్తుంది.

మాతౌవ్వ అనే కవిత్వం సిద్దెంకి యాదన్న మొదటి పుస్తకం తల్లిదండ్రులకు అంకితమిస్తూ, ఆత్మీయతను పంచిన మేనత్తకు హృదయపూర్వకవందనం చేసిండు యాదన్న.

చదువుకునే విద్యార్థులకు అంబేద్కరిజాన్ని నూరిపోయడమే లక్ష్యంగా వారి ద్వారానే ఈ అణగారిణ వర్గ సమాజాన్ని చైతన్యం చేయగల "దరువుకోసం మొట్టమొదటి కవిత రాసింది యాదన్ననే...కాలేజిలో కవితల పోటీలు పెడ్తే...అది ఖచ్చితంగా యాదన్నకే దక్కేది. గోనెపల్లి నుంచి సైకిల్ మీద వచ్చిపోయేది యాదన్న, మేము కాలేజిపక్కన్నే మామ కిరాయికి ఉండేది. పక్కనే ఉన్న మేము అప్పుడప్పుడు కాలేజికి డుమ్మలుకొటినా యాదన్నమాత్రం 14కి.మీ. దూరం నుండి రోజు సైకిల్ మీద కాలేజికి వచ్చేవాడు అంత పట్టుదల గల మనిషి యాదగిరన్న. వాల్లింటికి మేము, మా యింటికి యాదన్న, గిట్లావచ్చిపోవుడుకు...స్నేహంతో ఆగకుండా...ఒక ఇంట్లమనసులెక్క అయిపోయినం కాదు, కాదు అయ్యేటట్లు చేసింది, మా వేదిక.

14 సం॥ర అనుబంధంలో మా వేదిక నుండి ఆడియో కాసెట్లు, 4 పుస్తకాలు, 100ల ది సభలు, సమావేశాలు, చర్చలు, వాడి, వేడి కరపత్రాలు, నిజాయితీగా నిర్భయంగా ఉన్నదున్నట్లు మీట్లాడినమ్, అదంతా మాలోని సలషితత్వమే కారణం. దరువు అప్రచురణలుగా అచ్చయిన పుస్తకాలలో సిద్దెంకియాదన్న రాసినదే.

1) మాతౌవ్వ – కవిత్వం

2) ఓయుద్ధం – సంకలనం

3) ఇప్పుడు – బతుకుపాఠం – 2వ పుస్తకం

14 సం॥రాలలో మేము సంపాదించినది నమ్మకం, తెలంగాణ పదిజిల్లాల్లో మా ఆలోచననలతో సంపాదించుకున్న బహుజన బలుగం. సామాజిక వివక్షత – ప్రాంతీయ వివక్షతపై మీ పోరాటంలో "తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు ప్రాంతీయ వివక్షత" పై మా పోరాటంలో "తెలంగాణ రాష్ట్రం ఏర్పాటు ప్రాంతీయ వివక్షత జరిగిన యుద్ధంలో

గెలిసిట్లే... ఇక మిగిలింది సామాజిక వివక్షతపై గెలుపే..."

ఎంత జెప్పిన ఓడ్వని దంగని ముచ్చటనే సిద్దన్నది.

ఇగ కవిత్వాన్ని సూత్తుంటే కర్రును కొలిమిగాల్సి సర్పిస్తున్నట్లే గనవడుతది. సెల్కల పూలనుదెచ్చి...బతుకమ్మ పేర్చినట్లే అన్పిస్తుంటది. కవితల నిండా తెలంగాణ తండ్లాట, తెగించిన పోరాటం

ఆత్మగౌరవ నినాదం, ఆశయాల పునాదులు, అలుగిడ్సిన పానాదులు, ఎర్రమబ్బుల లేచి మర్రవడ్డ ఆలోచన నీలి వర్ణమై...పాకినట్లు...బతుకుపాఠం నిండా...

బహుజనల బతుకే కనబడ్డది. కవిత్వం అంటే జీవితం, జీవనపోరాటం, కవిత్వం అల్లుకున్న ముల్లపొందల దాగిన మల్లెపూల వాసన తీరు. వంగి పని చేస్తుంటే ఒల్లునిండా కారిన చెమటజాలు, బతుకుపాఠం చెప్పే నిజాలు.

కన్నీరు కార్చే కండ్ల గురించి ఓర్వలేని కండ్ల గురించి తేడా తెల్సి నడ్సి అక్షరాలను నడిపిస్తున్నాడు.

యాదన్న... యాదన్న కవిత్వం శ్రమ కవిత్వం, బతుకు కవిత్వం అందుకే "బతుకుపాఠం" గా ముందుకు తెచ్చినడు. మనస్ఫూర్తిగా ఆహ్వానిద్దాం, సాహిత్య ప్రపంచంలో కొత్త ఒరవడిని సృష్టిస్తున్న నవతరం తెలంగాణ కవుల్లో నావికుడు కావాలని సిద్దెంకి యాదగిరన్న మరింత బాధ్యతతో ముందుకు సాగాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్న.

తెలంగాణ రాష్ట్రం సాధించినం, కాని దొరలపెత్తనం లేని తెలంగాణ సాధించడం కోసం అంబేద్కర్, పూలేల ఆశయాల తోవలో, కొమురంభీం దొడ్డి కొమురయ్య, సాకలి ఐలమ్మల వారసత్వ పాల్గొలో తెలంగాణ నవ నిర్మాణం జరగాలనే తపనతో ఈ బతుకుపాఠంతో పాటు మరింకెన్నో కవితలు రాయాలని ఆశిస్తూ....

ఇట్లు

దరువు ఎల్లన్న ఓ.యు.

తేది: 15-4-2014

# అక్షరాలతో నేనూ....

అక్షరాలు జీవిత సాక్షాత్కారాలు భవిత నిర్మాణ నిపుణత్వం అక్షరాల్లో నిక్షిప్తమైంది. అక్షరాలకు అక్షరాలు అని ఎవరు పేరుపెట్టారో కానీ నన్ను అంటిపెట్టుకొని నిత్యం నా వెంటవుండే మిత్రుత్వం, అక్షరాల పొందిక ఒక ఆటలాగ ఉంటుందనీ, మంచి పొందికను చదివిన అక్షరాల అల్లికను రాసిన కలిగే ఆనందం అంతాయింతా కాదు. అక్షరాలను కొందరు పొందిక కోసం రాస్తే కొందరు జీవితాల్ని ఒలకబోసేందుకు రాస్తరు. రెండోరకం నాకు చాలాయిష్టం. ఏది రాసినా నా చుట్టూ ఉండే జీవితాలను ప్రతిబింబించడమే పనిగా పెట్టుకున్నాను.

చిన్నప్పటి నుంచి కళలపట్ల మక్కువ పెంచుకోవటం పీరీల పండగకు వేషంకట్టి సంబూ రం కోసం ఆడిన నాకు అక్షరాలే శాశ్వతమని తెలిసింది. అక్షరాలు నిత్యనూతన యవ్వనమై వికసిస్తున్నాయని తెలుసుకున్నాను. ఈ అక్షరాలు పుస్తక మడిలో నోటితో ఏరుతున్నపుడు మనసు ద్రవింపజేయడం, పురికొల్పడం, బాధపడడం, కార్యక్రమానికి ఉద్యుక్తులవడం,బతుకు బోధన కల్గించడం. ఇవన్నీ అక్షరాలకే సాధ్యం పాఠశాల గురువులతో మొదలుకొని కళాశాల వరకు కొత్త విషయం నేర్పేదేదైనా నాకు గురువే.

అక్షరాలతో దోస్తీ కట్టి బడికిపోయిన రోజునుంచి ఎపుడూ అక్షరాల్ని వదిలిపెట్టింది లేదు. నేను నేర్చుకున్నకాలం ఆ తర్వాత నేను నేర్పుతున్న కాలం ఇంకా కొనసాగుతుంది. కళాశాల విద్యను అభ్యసిస్తున్నప్పటి నుంచి కళల పరిచయం నన్ను మరింత ముందుకు తీసుకపోతుంది. అనేక మంది కళాకారులతో కొత్త పరిచయాలు సామాజిక స్పృహ కల్గించాయి.

1998లో కళాశాల కళల కుసుమాలను ఎప్పటికీ మరిచిపోలేని అనుభవం అనుభూతి కూడా కళాకారులుగా, సాహితీ మిత్రులుగా ప్రారంభమైన మా జీవితాలు **కళ కళకోసం గాదు. కళ ప్రజలకోసం** అనే నిరంతర అన్వేషణలో మొదలైంది. ఆశయాల ఆరాటంలో ఆత్మీయంగా కలుసుకునేది దరువు ఎల్లన్నను. సబ్బండ వర్ణాల...సిలకొయ్యకెక్కిన అతారెలు ఐక్యం గావాలని. సదువుకునే కాడనే సంఘటితమై మోగించిన మోతనే “దరువు”. దరువు కళాబృందం పేరున ఎల్లన్న, నేను మరికొంత మంది మిత్రులతో కలిసి 1999 డిసెంబర్ 20న ఒక వేదికను ఏర్పాటు చేసి, ఎన్నో కార్యక్రమాలు నిర్వహిస్తూ వస్తున్నాం.

ఆ 'దరువు' మాతో పాటు అది విశాలమైంది. ప్రతీఏటా వార్షికోత్సవాలు జరుపటం. సామాజిక సాంస్కృతిక అంశాలను ప్రతిబించించడం చేయడం జరుగుతూనే ఉంది. 2008లో ప్రచురితమైన "మా తొవ్వ" పుస్తకం ఒక ఇషార. అది నా బాధ్యతను మరింత పెంచింది. మారుతున్న సామాజిక పరిణామాల నేపథ్యంలో..."విలువలు" మారొద్దని అణగారిన వర్గాల నెత్తురు చెమటలకున్న విలువను అక్షరాలు ఎత్తిపట్టాలని "బతుకుపాఠం" అనే మరోపుస్తకాన్ని తీసుకొస్తున్న...

మీ ముందుకు రావటానికి అడగ్గానే ముందుమాటరాసిన గురువు నందిని సిధారెడ్డి గారికి, స్నేహంలో చెరో అక్షరమై విలువిచ్చే దరువు ఎల్లన్నకు, అందంగా కవర్ పేజిని తీర్చిదిద్దిన రమణజీవి గారికి, ఉస్మానియా యూనివర్సిటీ తెలుగుశాఖ ప్రొ॥ కిషన్‌రావు, ప్రొ॥ ననుమాస స్వామి, ప్రొ॥ ఎస్వీ సత్యనారాయణ, మాదిరెడ్డి అండమ్మ మేడం, దాశరథుల బాలయ్య మొదలగు గురువులకు నమస్కారములు. ఆలోచనలను పంచుకునే కదిరే కృష్ణ గారికి, హార్ధికంగా సూచనలు సలహాలిచ్చే గజ్జెల కనకరాజు అన్నగారికి  మరియు కూర మాణిక్య రెడ్డి, కూర జయపాల్ రెడ్డి, కూర రాంమోహన్ రెడ్డి, కూర రఘోత్తంరెడ్డి గార్లకు, ప్రొ॥ కాశీం అన్న గారికి, దార్ల వెంకటేశ్వర్రావు గారికి, తైదల అంజయ్య, పొన్నాల బాలయ్య గార్లకు, వెన్నుతట్టి ప్రోత్సహిస్తున్న దరువు ఎల్లన్నగారికి, దరువు కళాబృందం మిత్రులందరికీ దమ్మని రామలక్ష్మణ్, కుంటశ్రీను, బుగ్గరాజు, పల్లాటి నరేష్, మేక కనకయ్య, రమేష్ మిత్రులందరికి ఎం.ఏ.రహీం, ఇందుప్రియాల్ పాఠశాల బృందంకు, నా కవితలను వివిధ పత్రికల్లో ప్రచురించిన పత్రికా సంపాదకులకు, వరప్రసాద్, స్కైబాబా, వేముల ఎల్లయ్య, కృపాకర్ మాదిగ, జూపాక సుభద్ర, గోగు శ్యామల, గాదే వెంకటేశ్, జయధీర్ తిరుమల్‌రావు, గుడిపల్లి నిరంజన్, పసునూరి రవిందర్, సంగిశెట్టి శ్రీనివాస్, అన్నవరం దేవేందర్, గడీల సుధాకర్‌రెడ్డి, కొండి మల్లారెడ్డి, దాసరాజు రామరాజు, ఆత్మీయులు వేముగంటి మురళి కృష్ణ, దేశపతి శ్రీనివాస్, బెల్లంకొండ సంపత్ కుమార్ గారలకు, ఉస్మానియా యూనివర్శిటి మిత్రులు, సాహితి మిత్రులు, సంపాదకులకు, సిద్ధిపేట న్యూస్ సభ్యులకు, ఉపాధ్యాయ, గోనెపల్లి మిత్రులందరికి, నన్ను కన్న తల్లిదండ్రులకు సిద్దెంకి లచ్చవ్వ-రాజయ్య గార్లకు కృతజ్ఞతలు. నా కవితలకు మొదటి శ్రోతగా సహకరించిన నా జీవిత భాగస్వామి లావణ్య(పుణ్య)కు మరియు ముద్దుల కూతురు హర్షవర్ధినికి ఆశీస్సులు. ఈ నా రెండవ పుస్తకం 'బతుకుపాఠం ద్వారా మరింత ఆదరిస్తారని... మనస్ఫూర్తిగా కోరుకుంటూ...

మీ

**సిద్దెంకి యాదగిరి**

## విషయ సూచిక

1. అవ్వ కొంగు ........ 15
2 ఆదర్శ జీవితం ........ 18
3 శిరసొంచని తెగింపు ........ 20
4 అక్షరాల జీవితం ........ 23
5. హెచ్చరిక ........ 25
6 హక్కుల కవచం ........ 27
7 గురుమయం ........ 29
8 బతుకు పాఠం ........ 31
9. అతడే ........ 33
10. గగన మెక్కిన మైక్ సితార ........ 35
11 దేవులాట ........ 37
12. జాండా కాడ్కి రండ్రి ........ 39
13 వానమ్మ దండం ........ 42
14. చెంగోబిల్ల ........ 44
15. నేత ........ 44
16. దండోర ........ 47
17. కుల గర్వం ........ 49
18. చదువుతున్నం ........ 51
19. మారిపోతున్నాను ........ 53
20. విశ్వ మానవ విపంచి ........ 55
21. జాంబవ గ్యాణం ........ 57
22. జెల్లికం జెం.... ........ 59
23. అట్టి తునకల కూర ........ 61
24. బాడుగ అచ్చరాలు ........ 63
25. సమ్మె పోటు ........ 65
26. ఇంటి దొంగలు ........ 67
27. ఓ.. యు ద్ధం ........ 69

28. మాది మాకు ............................................................ 71
29. ఉద్యమ సూర్యుడు మరోలా ఉదయిస్తడు ................................ 73
30. రైతు ఎత ............................................................ 75
31. దోఖాభిప్రాయం ............................................................ 77
32. తెగారం ............................................................ 80
33. ప్రజలే ఉరితాళ్ళు ............................................................ 82
34. అవినీతి రహిత ఉషోదయానికి ............................................ 86
35. తెలంగాణ మార్చ్ ............................................................ 88
36. లైఫ్‌లాంగ్ మార్చ్ ............................................................ 90
37. ఎల్లగొడ్తం ............................................................ 92
38. ఎందుకంటే మేం కవులం ............................................ 94
39. మా కోసం వస్తున్నావా? ............................................ 96
40. మరుమన్న తల్లీ! ............................................................ 100
41. మసక బారి ............................................................ 103
42. తెగించే తెలంగాణ ............................................................ 106
43. మమ్మల్ని మేం ఏలుకుంటం ............................................ 108
44. ఆయుధం ............................................................ 112
45. శరీరాస్త్రం ............................................................ 114
46. హైద్రాబాద్ మాది ............................................................ 115
47. మరణం ఆరంభం ............................................................ 118
48. ఇంకా అనాదలమే ............................................................ 120
49. నెత్తుటి కౌగిలింత ............................................................ 122
50. వినువారు కావలెను ............................................................ 124
51. కాంతి మొలక ............................................................ 126
52. జీవాక్షర వలలు ............................................................ 128
53. ఒక నిమిషము ఆగు ............................................................ 130
54. జన శాసనం ............................................................ 132
55. గెలిచిన కల ............................................................ 134



# మా అవ్వ కొంగు

బిడ్డలు తింటరని
ఆమె తినకుండా
కోరి కోరి తెచ్చిన
తినుబండారాల చిరుభాండాగారం
మా అవ్వ కొంగుముడి
ఎతల ప్రవాహపు సుడిలో
కొట్టుక పోతున్న ఎంతోమందిని
తనకొంగు ఆనకట్టతో
పొర్లుతున్న దు:ఖానికి
అడ్డుకట్టవేసి ఓదార్చుతూ వుంటది!
కట్టెల మోపు పిడికెల తట్ట
అయ్యకు సద్దులగంప
ఆర్నెళ్ళ పంట వరికట్టలు
పాలిచ్చే ఆవు పచ్చిగడ్డి మోపుకు
బిందె మీది బిందెడు నీళ్ళు
ఎన్నో మోస్తున్న అవ్వ బాధ భరించక
మెత్తటి సుట్టబట్టైన కొంగు
అవ్వ తలమీద కురంబగడ్డైతది
ఎల్లి, ఎల్లని సంసారాన్ని తలుచుకొని
బెంగటిల్లి కోకిలరాగంలో
ఏడుపు మత్తడి దుంకి
బిగపట్టినా ఎగతట్టే

అరచేతిల పరుసుకున్న కొంగు
అవ్వకు ఆత్మగల్ల సుట్టమైతది
ఆరాటం కొద్ది పనిజేస్తూ
తగినంత బలంలేని అవ్వకు
పిడిసుట్టు తానై పికరు లేదంటూనే
పనిలో తోడైతది
ఒంగి వరి కలుస్తున్నా
ఎర్రటెండల పాదయాత్ర జేస్తూ
పనికిపోతుంటే మర్రినీడలా తోడుంటది
వానాకాలం ముసురులో
ఎండాకాలం రాళ్ళవానల్లో
అవ్వ నెత్తిమీద కొంగు
అన్నికాలాల్లో అండగా వుంటది
నా పిల్లలను
అత్తుకొని ఎత్తుకొన్నప్పుడు
ల్యాగదూడను నాకుతున్న ఆవులాగ
దుమ్ము దూళి దులిపేసి
ముక్కు సీముడు తీసి అక్కున చేర్చుకొని
ఉబ్బరపోస్తదని ఊపె విసనకర్రలా
మత్తునిద్రకు మెత్తగా మారిపోయే
పుండు మానడం కోసం
చెట్ల వైదుగం కట్లకు
అనుకోనని గాయమై మూలుగుతుంటే
నెత్తురు జల యిస్తున్నపుడు

చింపి చుట్టిన బట్టపేగు కట్టు
ఓ తల్లి కొంగుపేగు బంధమై
అడవిల బాధలు తీరుస్తది
మా రీతి రివాయి
మా బతుకు తీరు అంతా
మా అవ్వ కొంగుతోనె మొదలు
జాండకు దండం పెట్టినా
రెపరెపలాడుతున్న జండాను చూసినా
కండ్లనిండ మా అవ్వకొంగే కనబడ్తది

(సాహిత్య ప్రస్థానం అక్టోబర్ 2009)

**-సిద్దెంకి యాదగిరి**



# ఆదర్శ జీవితం

ఫలాలను పంచాలని
గాలివానకు
కూకటి వేళ్ళతో సహా కూలిపోతూ
తన నీడలో సేదదీరే
సోలిపోతున్న జీవులకు
బతుకు భరోస కల్గిస్తుందా ?
వాస్తవాన్ని వివరించాలని
దంతాల శత్రువు పగ
అంతు చూసేందుకే పొంచి ఉందని
దిగాలు పడిన నాలుక
తెగిపడాలనుకుంటే
నిజాన్ని ప్రకటిస్తుందా ?
ఎక్కు పెట్టిన ఆయుధాలు అయి
నలువైపుల చుట్టు ముట్టిన ముండ్లు
గుండెల్ని కొడుతున్నందుకు
మొగ్గ దశలో రాలిపోయి
పూత కాయయై ఫలమియ్యకుంటే
బతుకు పరిపూర్ణమవుతుందా ?
రైతు శమట జాలుతో నాగటి చాల్లల్ల పడిన విత్తు
పురిటి నొప్పులు దీస్తు చచ్చిపోయి
అనేక మొలకలకు జన్మనివ్వకుంటే
చచ్చిన సంతృప్తి మిగులుతుందా ?
యుద్ధ వీరుని పోరాట పటిమ

విజయమైతే గర్వం
చంపి చావటమే వీరమరణం
ఆత్మహత్య చేస్కోవటం
పిరికి తనం గాదా ?
బతుకు పోరు జేసి
ఎంచుకున్న లక్ష్యం కోసం
తెగించి కొట్లాడక
చచ్చి సాధించేదేముంది ?
ఉన్నవాల్లను కన్నీల్లతో చంపడం దప్ప
మానవత్వం కోసం
మంచితనం పంచడానికి
చెడు మెడలు వంచటానికి
మరణపుటురుల్ని జయిస్తూ
ఓటమితో గెలుపు జీవితం ప్రారంభించాలి
అందుకే గుణపాఠంతో గుండెరాయి జేసుకుని
ఒత్తిడిని తట్టుకుని
అవమానాన్ని గెలిచినపుడే గదా!
ఆదర్శ జీవితం
అందరికీ వెలుగు అయి
దిశా నిర్దేశం చేసేది

24-02-2012 ఉదయం 5గం॥లకు

11-11-2012, ప్రజాశక్తి ఆదివారం అనుబంధంలో ప్రచురితం

**-సిద్దెంకి యాదగిరి**



# శిరసొంచని తెగింపు

అదే వివక్ష
అదే అవమానం
అదే బాధ
విస్తృత వ్యత్యాస పీడనల్లో మొలకెత్తిన పిడికిలి
తనువంతా యుద్ధస్థలి
తరతరాల ఆవేశాల ఆవిరి
తమిళం ఐక్యతలూదిన ఉద్యమ తెగ సమరం
విముక్తి కోసం యుద్ధాయుధమే
ఆకాంక్షసీసాల్లో నెత్తురింపి జీవితాల్ని స్రృచేసేదీక్ష
మట్టు పెట్టడానికి ముట్టడి
మనుషుల్ని బాంబులుగా మలచిన
సైనేడు గుళికల గుట్టు సమాధి
మిస్టరికీ హిస్టరీ
శతృవు ఎవడైనాసరే
నింగినేలా నీళ్లల్లో ఎట్లయినా సరే
స్వదేశమూ విదేశమూ ఎక్కడైనా ఓకే
పులులు గాండ్రింపు నిరూపణలు
ప్రళయ విస్ఫోటన పెళపెళల సవాళ్ళు
మాయదారి రాయబారాల్లో మధ్యవర్తిత్వాల చోద్యం
అంతర్జాతీయ మానవసమాజం
మనుగడ సమస్యకు ఉగ్రవాదముద్ర
శాంతి చర్చలో అశాంతిరచ్చ

జాతులపై అప్రకటిత యుద్ధం
ఎంతలో ఎంత వ్యత్యాసం
షేక్ హ్యాండ్‌లు ఆలింగనాలు
చిరునవ్వులు గిలిగింతలు అన్నీ బరాబరే
ఆచరణ క్రూరత్వం
హామీలు మరణ మృదంగం
విరమణ ఒప్పందం వికటించింది
రంకునేర్చిన రాజ్యం ఉల్లంఘనలు
అదనుజూసి బాంబుల జూలు విదిల్చిన సైన్యం
చావో రేవో పులుల గాండ్రింపు
ముక్తిపోరులో ముందుకు సాగే ధీరత్వం
మృత్యువుకు శిరసొంచని తెగింపు
ఒరిగిన వీరుల రక్తపరిమళాలని పీల్చి
ఎడారిలా విలపిస్తున్న భూతల్లి
పులకించిన దొంగ దెబ్బ ఆనందం
ముద్దులతో పుడమిని తడిమిన అధ్యక్షున్ని
తెలేసిన కళ్ళు నిలదీసి వెక్కిరిస్తున్నై
పంతం అంతంకాదని పారిన రక్తం
నిలువెల్ల నల్లగా నినదిస్తుంది
మీసం మెలేసిన మోసగాల్లతో
పంచనామాలు అంతం కాదని ప్రకటిస్తున్నాయి
ఎక్కుపెట్టిన ఆయుధాలు గాయాలవుతున్నపుడు
జాతుల బాధ జమిడిక నాదమైతది
ప్రభాత భేరి ప్రేగించ ప్రజ్వరిల్లే కోరికలు

ప్రజా ఉద్యమం ప్రభాకరులయి ఉదయిస్తది
యుద్ధాక్షరాలు నూరిపోసే అమరత్వం
తిరుగుబాటు వజ్రాయుధాలుగా తీర్చిదిద్దుతది
నివారించిన యుద్ధం నిజం తెలుపడానికి
ధృవతారలా నింగిలోంచి బోధిస్తది

3-3-2010

-సిద్దెంకి యాదగిరి



# అక్షరాల జీవితం

మానవ వనంలో అలజడి నేను
కవనంలో జనం బాధ నా మేనిఫెస్టో
ఎప్పటికీ నాకు జనమే జండా ఎజెండా
మనుషుల సమానత్వమె నాకు మాగ్నాకార్ట
అక్షరాల న్యాయ సమరంలో
పరిష్కారం కోసం మనసు భ్రమణం
అక్షరీకరణలో మెదడు పరిభ్రమణం
ఒంటరి పోరు ఆలోచనలో అక్షరాలే ఫోర్స్
బుల్లెట్ మింగుతున్నపుడు
నెత్తురు సిరా అత్తరుచల్లి
కత్తికొన మీద నిత్యత్యంనిలిపి
ఉరికొయ్య వదిలిన అమరత్వం ఆసరాగా
పురిటినొప్పుల బాధ తీసిన
పెద్దల అక్షరాల బాటపట్టిన
నాలోనేను ఆలోచించినా
నీతోనేను ముచ్చటాడినా
పదాల్లో వాక్యాల్లో
ముందుగా ప్రవహించి పరవళ్లు తొక్కేవి అక్షరాలే
ఐక్యత విలువై మొలకెత్తితే విశ్వప్రేమ విస్తరణ యాగమైతది
ఈ అక్షరాలు
అభాగ్యుల వద్ద కాసిన్ని కన్నీళ్లనీ
కొందరిపట్ల జాలిని రాలుస్తూ
ఇంకొందరి పట్ల జ్వాలల్ని రగిలిస్తూ
దేశభక్తిని నూరి వీరున్ని ప్రసవిస్తయి

అక్షరశక్తి నేతల్ని ఆవహించినందున
చరిత్ర ఘనత అక్షరమయమైంది
అక్షరాలు విరివిగా అమ్ముతున్నారు
నాలో అక్షరాలు లావాల ఎగజిమ్మి ఉప్పెనవుతున్నాయి
ఉద్రేకాన్ని రేపుతున్న ఉద్వేగమై
సామరస్యాన్ని పెంచి పోషించాలని ఆదేశిస్తున్న సునామిలా
నేను అక్షరాల్ని బడిలో నేర్వలేదు
తల్లి ఒడిలో నేర్చుకున్న
పలుకబలుపం పట్టిబడికి పోయింది
మున్ముందు అక్షరాలని పంచాలనే......
ఆరిపోతూ వెలుగిచ్చే దివిటాల్లాంటి ధీరత్వాన్ని
స్వేచ్ఛకోసం విహరిస్తూ తెగిపడ్డ రెక్కలను దర్శిస్తున్న
నియంతల అంతుచూసిన నినాదాల్ని
అణచివేత వేతల్ని అణచివేసిన ఆదర్శాలని అధ్యయనం చేస్తున్న
అసమానతలపై అక్షరాల పంజా ఎత్తి
అజ్ఞానంపై అక్షరదాడి చేయటానికి చైతన్యం పంపుతున్న
ఆత్మీయతాక్షరాలై చదువురానోల్లను అల్లుకుంట
చదివెటోల్లకు సారమై జవాబిస్త
ఆచంద్ర తారార్కం నిలిచే అక్షరాలు
సాఫల్యం అనే కచ్చురానికి సారధి కాబట్టి
నేను ఉదయం లేచింది మొదలు
రాతిరి మెలుకువున్నంత సేపేకాదు
ఊపిరున్నంతవరకు అక్షరాలే జీవితం
(సాహితి కిరణం మాసపత్రిక - కళా సుబ్బారావు కళా వేదిక ఉగాది
పురస్కారం, 27-03-2014)

**-సిద్దెంకి యాదగిరి**



# హెచ్చరిక

జీవితమంటే కలగాదు బిడ్డలారా !
జీవన్మరణ జిద్దు అపురూపం గాదు అలజడి
పద్మవ్యూహం ఛేధించాలంటే
ఇళ్లు దాటే ముందు ఇగురం ముఖ్యం
ఒళ్లను నాగజెముడు ముళ్లుగా మలుచుకొండి
శిరస్త్రాన ధైర్యం ఆపాదమస్తకం ధరించి
అణువణువు ఆయుధపదునును అద్దుకొని
నిలువెల్ల ఎదురుదాడి నిప్పులతో
అడుగడుగు ఒగయుద్ధమని సిద్ధపడండి
ముసుగు ఒగ బలహీనత కాదు
అడ్డుపడి ఆదుకునే డాలు ఆచరణ ముందస్తూ రక్షణ
ఆత్మరక్షణ విద్య నిరంతర అంగరక్షకుడు
అబల ఒగ నానుడి జయధ్వానాలే వినుడి
నీకు సహాయపడే నువ్వే ఒక సాయుధం
నీకోసం పోరాడే నువ్వే ఒగ తిరుగుబాటు భావుటా
ఉత్ప్రేరకాల్ని మనసులోకి ఒంపుకొని
ధీరత్వాన్ని ఒకరికొకరు పంపుకోండ్రి
ఆత్మ స్థైర్య ఆయుధాలను నింపుకుంటూ
వెంటాడే నీడల్ని వేటాడండి
వెకిలి చేష్టల మీద విస్పోటానాలై

కన్నీళ్లని కత్తులుగా నూరండి
ఘోరం జరగకముందే
పోరుబాటను రిచార్జ్ చేసుకుంటూ
పోటురాళ్లను బూటుకాళ్లతో తన్నండి

3.05.2013.

-సిద్దెంకి యాదగిరి



# హక్కుల కవచం

హక్కుల్ని తొక్కిపెడ్తున్న నియంతృత్వంలో
బ్రతుకు బలహీన మవుతున్నపుడు
హక్కుల రక్షణకోసం మొలకెత్తే ఉక్కు కవచం
బూటకపు ఎన్‌కౌంటర్‌ల రహస్యాన్ని
పెన్ స్టైత్ స్కోప్‌తో విని అక్షరాల్తో పేర్చి
అణచివేతల్ని నివేదించే నిత్య రణ సైనికుడు
యినుపబూట్ల పగ వీపును పడుగుదొక్కినా
పొగరెక్కిన లాఠీపోట్లకు శరీరం కమిలినా
ప్రాణమున్నంత వరకు హక్కుల కోసం పాకులాడే నిత్య చైతన్యం
అప్పుల బాధల్లో ఆరిపోయిన రైతు కుటుంబాల్ని అల్లుకొని
గిట్టుబాటు ధరకొరకై పట్టుపడుతున్నపుడు తోడు నిలిచి
అభివృద్ధి మాయసెజ్‌ల పేరు
అక్రమంగా రైతు భూమి లాక్కుంటున్నపుడు
కొండంత అండగా నిలిచే రైతువాది
గుజరాతు గుండె గాయం మాన్పటాన్కి
రాజ్యం ప్రేరేపిస్తున్న సల్వాజుడుం నిలువరించటాన్కి
కాశ్మీరు బాధలు కలకలం రేపుతుంటే
నందిగ్రాం పోరాట పటిమను అందిపుచ్చుకొని
బీహార్ బీదప్రజల కోసం
అరణ్య రోదనైన వాకపల్లి గిరిజన ఘోషకు
సుడిగాలి పర్యటనల్లోను
హక్కుల కోసం ఉక్కు పిడికిలి నినాద ప్రశ్నలు

ఎప్పటికపుడు రూపాంతరం చెందాలని
పౌరహక్కుల స్వేచ్ఛకు ప్రతీకలై
మానవహక్కుల ఉనికి కోసం కలెబడ్తున్నయి
త్యజించిన ప్రొఫెసర్ ఉద్యోగం
ఉప్పిడీ ఉపాసముండి
కన్నీళ్ల కాలంతో పోరాటం
నిజాయితీ నిరాడంబరంగా నడుస్తూ
ఆభాలగోపాలం మెచ్చే మానవహక్కుల
బాలగోపాల ఆశయాల్ని మనమూ ఎత్తుకుందాం
మనుషుల్ని తొక్కె కర్కష యినుపబూట్లు
పొగరు పోట్లకు కమిలిన గుర్తుల్ని తడిమాలి
తక్షణ న్యాయంకై తండ్లాట పోరు
గిట్టుబాటు ధరకై రైతుతో జతకొట్టాలి
అప్పులు చేసిన రైతులహత్యల బాధలు విని
ఆత్మీయత అల్లుకొనే అభ్యుదయం కావాలి
అభివృద్ధి సెజ్‌ల పేర ఆక్రమిస్తున్న భూమిని
పేదల్ని ముంచే సర్కార్‌ను ప్రశ్నించే జనప్రళయం రావాలిపుడు

(16.10.2009 బాలగోపాల్ గారి స్మృతిలో)

**-సిద్దెంకి యాదగిరి**



# గురుమయం

నా తల్లి తనలో నున్న నన్ను నిమురుతున్నపుడు
అక్షరాల తీరు కదిలిన
ప్రపంచానికి పరిచయం చేసినపుడు
అందరినీ సంతోషపెట్టడానికి
అక్షరాల సవ్వడితోనే ఏడ్చా
ఎదపైకి ఎక్కించుకొని
చూపుడువేలు సృష్టిని పరిచయం చేస్తునపుడు
పులకరించిన నా భవిష్యత్ కోసం
దినమంతా తొలకరి అయి తడుస్తూ
నా మనసులో శమట జల్లుల విత్తనాలు నాటిన
నా తండ్రి నాకు రెండో గురువు
బాడుగ బండి మీదికి బస్తాలు ఒడుపుగా మోసేది
నాయిన తోటి తట్ట పారపట్టి కూలి పనికి పోయింది
కువ్వారంలేకుంట పనిచేసుడు నేర్పిండు నాయినే
పాఠంతో గుణపాఠం ఘనపాఠం
మంచితనమంటే మనిషితనమని
తరాల అంతరాల్ని అంతం చేయాలని
నన్ను 'మని' వెంట పరుగెత్తని మనిషిగా తీర్చిదిద్దిన
నేటి బ్రహ్మలు నా గురువులు
నా ఆలోచనల కర్మాగారంలో
అక్షరాల్ని ఆయుధాలుగా జేస్తున్న
ప్రజా సమస్యల పాఠశాలలో

సమస్యలే గురుబోధలు అవుతూ
బాధ్యతలు గుర్తుచేస్తు కొత్తదనం నేర్పుతున్నయ్
ప్రజల్ని మింగే కుట్రలు ప్రబలుతున్నపుడు
ప్రజాస్వామ్యం హత్య చేయబడుతూ
కనపడని సామ్రాజ్య విస్తరణ విషం చిమ్ముతుంటే
నా మనసు కవిత్వ నిప్పుకణికలై రగులుకుంటది
ఉద్యమ మంట అంటుకుంటది
ఎందుకంటే అంతటా అన్నీ గురుమయమే కాబట్టి

10-09-2011

-సిద్దెంకి యాదగిరి



# బతుకు పాఠం

“ హోంవర్కు ఎందుకు చెయ్యలేదు ”

“ కాపి లేద్సార్ ”

“ ఏం పేరు ”

“ పవీన్ ”

“ తెచ్చుకోపోయినవ్ ”

“ మా నాయిన తేడు ”

“ మీ నాయిన ఎంజేస్తడు ”

“ బుగ్గలు అమ్ముతడు ”

“ మీ అమ్మ ఏం చేస్తది ”

“ ఎంట్రుకల బ్యారం ”

“ మరెట్ల సదువుతవురా ”

“ ఇపుడేడు ”

“ ఎక్కడ మీ యిల్లు ”

“ చెట్టుకింద ”

“ ఆ… ”

“ కరంటి వున్నదా ”

“ గుడిసె మీదికేలి పోతది ”

“ బట్టలు ”

“ పాతయి అడుక్కుంటం ”

“ తిండెట్లా ”

“ మధ్యాహ్న భోజనం బడిల ”

" దొరికితె తింటం లేకుంటే ఉపాసముంటం "

" . . . . . "

– – –

"తిట్టినా సరే, కొట్టినా సరే

ఇజ్జత్ దీయకుండ్రి సార్ "

" అయ్యో బిడ్డలారా !

ఒకపుడు మీలాంటి నేను

ఇపుడు బతుకు పాఠాన్ని నేర్పుతున్న

నా బతుకు బండి సారానిన నూరిపోస్తా

ప్రపంచాన్ని జయించగ

అక్షరాయుధాలు నీ భుజానికేస్తా

05–08–2012.

–సిద్దెంకి యాదగిరి



# అతడే..

మరఫిరంగులు, మందూ మార్బలం లేదు
వాయు, జల, ఆకాశమార్గాలు ఆయనవి కావు
పదాతి దళమా అదెక్కడిది ?
ఆయనకే ఏదీలేదు అతడే ఒక సైన్యం
చెదరని విశ్వాసం బెదురని మనస్తత్వం
భయానికి భయమయ్యేట్లు మాటల్ని మంటల్ జేస్తడు
చురకత్తులవుతున్న చూపుల్ని
మెహరించిన సైన్యం ఎదురించలేక మొరాయిస్తుంది
ఆయన పోరాడుతున్నడు
కాలుదువ్వి కవ్వించేటోనికి కాలు అడ్డం పెడుతూ
వీరమరణం ఒక్కసారే కంచుకంఠంల ఉక్కు నాలుకయి
దిక్కులు అదిరేలా ఉరుముతున్నడు
తలపడాలని తలపోసుకున్నడు
ఆయన తలపడేది ఒకరి తో గాదు
ఇద్దరితో అంతకన్నా గాదు
ప్రపంచ పోలీస్ బాస్‌కు ప్రమాద ఘంటికల్ని మోగిస్తున్నడు
రాజ్యాధినేత గాడు సామంతుడు (అంతకన్నా) గాదు
జన హనన ఆయుధాల విధాత కాదు
ఉగ్రవాదాన్ని పోషించే ఛాందసవాది కాదు
అస్త్ర శస్త్రాలను ప్రయోగించే నైపుణ్యమూ లేదు
రవి అస్తమించని సామ్రాజ్యాన్ని నువ్వెంతపో అంటున్నడు
వేయి గోవులను తిన్న రాబందుకు

ఎపుడు ఊహించని కష్టమొచ్చి
నిజ నిర్ధారణ జడివాన వణుకు పట్టుకుంది
ఆ హరికేన్ తాకిడికి బారక్ బందూక్ బొందల వడ్తదని భయం
ఆయన చేసిన నేరమా ?
మారణాయుధాలు చంపలేని
వాస్తవ విత్తనాలు వెదజల్లుతూ
అహర్నిశలు కృషి చేస్తున్నడు
సంకల్పానికి కార్యసిద్ధికి కారణమవుతున్నాడు
వివరాలు బయట పెడుతున్నాడు అని
అగ్రరాజ్యం ఉగ్రరూపం దాల్చింది
ప్రపంచ పౌరుడా అద్భుత వీరుడా అసాంజే
నీ వెంట మేమున్నం

13-08-2012.

-సిద్దెంకి యాదగిరి



# గగనమెక్కిన మైక్ సితార

శ్వేత వివక్షల అంతరాన్ని దాటి
స్వరసవ్వడి లయాన్విత నాట్యం
మెలికలు తిరుగుతూ మెరుపులై
విశ్వవ్యాపితంగా అభిమాన సంపద సొంతం
ఉత్సాహం
ఉత్ప్రేరకం
అన్నీ కలగలసిన నీ పాట
హృదయ తంత్రుల్ని మీటుతూ
కేరింతల ఆనందం
ఉద్వేగం
ఉత్కంఠత
ఎముకలు వంచి ఆడే ఆట నృత్యం
అంతరంగంలో విద్యుత్తరంగమై
మనసంతా అల్లుకుంటుంది
అంతరాలను తొలగించాలనే ఆలాపన
కోకిల కూతతో సాహిత్య కూర్పు
మార్పుకోసం పరితపించిన నాంది
మానవత్వం సమానత్వం పలికించింది
నీ సంగీతం
బతుకంతా పాటదైనా
అభిమానము ఆక్రందనైంది
శవయాత్ర విశ్వాసముదే

యిసుక వెదజల్లినా
నేల రాలనివ్వని నీ రాజ నం
జన ప్రభంజనమై
జోహార్లు అర్పిస్తూ వీక్షించిన కళ్లు
టీవి స్క్రీన్ల విశ్వవ్యాపితం
ఆటపాటలతో
ప్రపంచానికి నువ్వెపుడూ గైడ్‌వై
దిశానిర్ధేశకుడవే.... !
నల్లటి ఆకాశవనంలో
చల్లటి సమీర శృతిలయవై
మా గుండెల్లో నిండిపారే నీ గేయం
నిత్యం గగనమెక్కే 'మైక్' సితార
సంగీతాకాశంలో ధృవతార

(మైకేల్ జాక్సన్ స్మృతిలో)

**-సిద్దెంకి యాదగిరి**



# దేవులాట

చేమంతి బంతి గడ్డి గన్నేరు పూలు
గర్క గున్న తంగేడు తీరొక్క పూలు
రకరకాలు రంగరించిన అందంగా బతుకుమనే అమ్మా
బతుకమ్మా !
చప్పట్లలో గాజుల నాదమై గొంతెత్తిన రాగానికి
కోకిలలు కోరస్ అవ్వాలని కోరుకుంటయి
దప్పు సప్పుల్ల సాగుతున్న ర్యాలీని చూసే ప్రకృతి
పరవశించి పోతది
ప్రపంచంలో పూలను పూజించే పద్ధతి ఎక్కడా లేదనీ
జొన్న తలలొంచి దండం బెడ్తూంటే
పునాస పంట కొత్తతోరణాలతో ఆహ్వానిస్తూంటది
కొత్త బట్టలు కోటి ముచ్చట్ల జంబిపూజలు
అలాయి బలాయిల పెనవేసుకుంటున్న ఆత్మలు
దసర బంగారం ఇచ్చిపుచ్చుకునే సంస్కారం, నమస్కారం
గుంపుకళ్లతో గ్రామం అంతా ఆకాశమంతై
పాలపిట్టకోసం పల్లెజనం పాకులాట
పొలావుబువ్వ షర్బతి పేర్పు
తారతమ్యం లేని కుడ్కపేర్ల మొక్కు నిలువుదట్టీల కొలువు
బచ్చీసపేర్ల సుగంధాలు
మలీద ముద్దలు మక్కఅట్కుల బంధాలు
హాసెన్న ఊ సేన్న లాల పాటల పూదోట
అసోయి దులా దరువుల ఆట

ఒక్కరోజు పక్కీరులయిన ఊదు పొగ వేషాలు
తీరొక్క వేషంలో తీయని భక్తి పారవశ్యం
హిందూ ముస్లిం భాయీ భాయీ-
సింధు దాసరి దరువులు
యక్షగానాలు వీధిభాగోతుల మద్దెల సపుడు
జడకొప్పు కోలాటంలో గురితప్పని గిరిగీత
కోయిల కూతలు ప్రజల గొంతులయ్యేవి
రంజిల్లిన ప్రజా కళలు
సీమాంధ్ర సినిమాల పెట్టుబడిల
విలన్ల భాషకు విలవిలలాడుతుంది
పోయిన కాన్నె దేవులాట సురువుజెయ్యాలే
యిత్తు వేసిన పొత్తును చిత్తు చిత్తు చేయ్యాలె
మనకళలను మనం కాపాడు కోవాలె

03.09.2008
రాత్రి 8:30గం॥లకు

**-సిద్దెంకి యాదగిరి**



# జాండాకాడ్కి రండ్రి

శివరాతిరి ఒక్క పొద్దుకు
బండ్లమీద దెచ్చిన కంద్రగడ్డ
ఊరూరు దిరిగి ఉప్పమ్మే బతుకు
తీరొక్క చెట్ల మందును
తిరుక్కుంట అమ్మెటోల్లకు
నెత్తిమీద పొయివెట్టి పూరీలు
చాతిమీద పలగ్గొట్టిన బండలు
చూసే కండ్లల్ల కనబడెదాన్ని మాయంజేసే
శాదనా సూరుల కనికట్టుకు
గొంతు వొంచిన సలాక
పండ్లు కొరికెత్తిన నాగలి
నడ్మకు కట్టిన ఎల్తకట్టె మొనమీద
బొడ్డుపై గాలిలో ఎగిరే పిట్టతరీక
యెన్కకు ముందట్కి యెన్నొంచిన తాడుదండెం
రాతిరంత మేలుకొని తమనేలే
దేవున్ల పెండ్లి జేసి
ఒడి బియ్యం పోసి
తప్క మాణిక్యాలతో ఇంట్లకు పిలిచే
పల్లె జనుల భక్తి ఆనందం
చిర్తల రామాయణం
బతుకమ్మ బోనాల పండుగలో
ఒక్కటైన సంప్రదాయం

కప్పతల్లి ఆటల్ల కాముని దానంల
నీళ్లా గోగుపూవు రంగుల్తో
తనువెల్ల తానంజేసే మూడు బజార్లతొవ్వ
తీరొక్క పంచాదులు
దడ్వతి దండుగ తప్పుల్తో
తలదించుకున్న తప్పుకు
తగిన శిగిష్ట
బాగోతులాడే శాందిరి
సర్కార్‌సారం జెప్పే బుర్రకథలు
ఉన్నదున్నట్టు చూపించే రీలుసీన్మ
పీరీల పండుగ
పెండ్లి ఊరేగింపు సంబూరం
ఓట్లల్ల గెల్సిన జులూస్
మా ఊరి గుట్టు అంతా
రాములు తీర్థంల యాడాదికొకసారి దిరిగే
రంకురాట్నమోలె జాండసుట్టూ
ఊరిజనమంతా తిరుగుతది
రోకండ్లు పలిగేటి రోని ఎండకు
చెర్లుకుంటల్ని నింపే ముస్రు తుపాన్లకు
చెత్తిరి పట్టే యాపచెట్టు కింద
మా ఊరి జాండ
మనుషుల్తో నిండిపోయేది
కులాలకు మతాలకు లేని మనిషికుతి
పొగాకు సుట్టకు పంచుకుంటూ

ఆత్మగల్ల మాటల్తో
ఆకుతీగ పందిరోలె కల్సిపోదురు
కదిలె బొమ్మలపెట్టే
ఎప్పుడైతే ఇంట్లకొచ్చి కదలకుంట కూసుందో
గప్పట్నుంచే ఆట పాటల మీద
రంగురంగుల్తో దాడిజేస్తూ
మనసు పొరలను మాయం జేస్తుంది
వారానికొకసారి సాగే అంగట్ల
మందిని జూస్తున్న జాండగుండె
యంత్రాలదాడికి వలసపోతున్న కూలీలను
ఉద్యోగాల పేరుతో ఊరు యిడిసెటోల్లను
పై చదువుల్తో పరాయిదేశం పోతున్నోల్లను జూసి
గడ్డకు వడ్డ శాపపిల్ల నీల్లకు తండ్లాడినట్టు
మనకోసం తండ్లాడుతంది
పల్లెతనాన్ని పోగొట్టుకున్న జాగల
దేవులాడి నిలవెట్టెతందుకు
అందరు జాండకాడ్కి రండ్రి

ఆగష్టు 2012
(తెలంగాణ సోయి - త్రైమాసిన సాహిత్య పత్రిక)

**-సిద్దెంకి యాదగిరి**



# వానమ్మ దండం

కప్పతల్లి ఆడుతూన్న తిప్పలు
ప్రాణాల మీద ఆశతో భక్తి బోనాలు
జలకుండలతో కన్నీళ్లు కలగలసి
దేవుల్లకు తానంబోస్తూ కొట్టుకాడింది కరువు
చుక్కలంటిన ధరలు నేలరాలాలంటే
వర్షంలో ప్రకృతి తడిసినపుడే
సగటు మనిషి సంతోషం
గాలివానలో పరుచుకున్న పందిరిలాంటి చెట్టు కిందికి
శరణుజొచ్చి చేరినపుడు
కూలిపోతున్న చెట్టు పిడాత ప్రాణం దీసింది
నింగినేల ఏకధారగా కురిసింది
తెంపులేని వాన చెరువు కట్టల్నితెంపి
ఊళ్లను ముంచింది
కరువు దూసిన కత్తులు వర్షాల వంతైంది
కూలినాలి బతుకుల గూడు కూల్చిపోయింది
చెదిరిపోయిన పిల్లల కోసం
రోదిస్తున్న తల్లి కండ్లు
పొగచూరింది
వరదల ఏరుపొంగినట్లు
పాలుపొంగి ఒలుకుతున్నై గుండెల్ని కెలుకుతూ
సూదులై గుచ్చుతూ సలుపుతున్నై
బురదలో ఉబ్బిన పీనుగులు

పట్టుకుంటె పల్లెటట్లు తయారైన
దిక్కులేని చావులు
పత్తాదొరక్కుండ..
పొద్దుమాపు పంటను
కంటికి రెప్పలై కాసిన రైతుగుండెను
జడివాన దాడి చేసింది
యిపుడు తొవ్వలన్ని నీళ్లే
పునరావాస కేంద్రంలో పులిహోరకోసం కొట్లాటలు
గల్లీలీడర్ల గస్తి బాగుంటది
ఏరియల్ సర్వే చేస్తున్న సీఎం ఎలిక్యాప్టర్
రీల్ సన్నివేశమైతది
కనికరం లేక కరువుల
కన్నెర్ర జేసి వర్షంల చంపుతున్న
వానమ్మ నీకు దండం
మానవాళికి నీవె అండ
అతివృష్టి అనావృష్టి ఏదైనా గుదిబండ

12.01.2009
(విస్తృత వర్షాలకు జరిగిన బీభత్సాన్ని చూసి స్పందించి)

**-సిద్దెంకి యాదగిరి**



# చెంగోబిల్లా

అడుగడుక్కి అగ్నిగుండాల బాధల్ని దాటి
మురిగిన తోల్ల కంపు
లంద బతుకుల్ని
ఆగం జేసిన యిచ్చంత్రాల పనితనం
మా పనితట్టకు కాట్లు వెట్టి
కూట్లె మన్నువోసి నోట్ల బుక్క ఎత్తగొట్టింది
కడక్‌గ నడిచే ఠీవికి
కిర్రు చెప్పుల కాందానా చప్పుడు
తెచ్చిన గొప్పదనమే గోతులు తవ్వింది
చీకటి పొగసూరి
పెట్టుబడి వరదను తట్టుకోలేక
పనితట్ట పత్తాలేకుంటయింది
ఛత్రకన్నుదెరిసిన కార్పోరేట్ చూపుకు
మాదిగి ఇసిరెల పనితనమంతా
జెంగుదిని సిల్కుంబట్టి చితికిపోయింది
నీ నడకకు, పరిపాలనకు
నీ రాజకీయ భవిష్యత్‌కు మేమే పునాది
ఓట్లప్పటి మాటలు తుప్పుపట్టి
నమ్మిన మాకే ముప్పు దెచ్చినయి
మా తప్పు మేం తెలుసుకున్నం
నీ అధికారం కాటుకు చెప్పు దెబ్బకొడ్తం
గూటం దెబ్బలు పడని చెప్పు ముద్దుగ్గాదు

ఆముదం అద్దకపోతే చెప్పు ఆకర్షణీయంగాదు
చెప్పగ వినని రాజకీయం
చెంగోబిల్లయితది
చరిత్రలో చెప్పులు ఏలిన రాజిర్కం
ఇపుడు తప్పుడు నేతలు ఏలుతున్నరు
అదే తిరుగుబాటు చెప్పుల వర్షంల రాలిపోతరు
రాజకీయంగా కూలిపోతరు

సెప్టెంబర్. 2009

-సిద్దెంకి యాదగిరి



# నేత

ఒక్కొక్క దారం ఆధారమయి
యిజ్జత్ కాపాడే నేతకళ
పాలకులకు పట్టని వ్యవహారమై
పాడే  మీద ఊరేగుతుంది
మగ్గమేసే నేత జీవితం దినదినము మగ్గిపోతూ
అప్పుల్తో బుగ్గిపాలయితంది
కడుపునింపని పనితనం మాడుపు మొకమేసి
వడికిన తక్లీదారం ఉరితాడై మెడచుట్టు బిగుసుకుంటుంది
విరామమెరుగని నేత ఒక్కతీరుగ ఎముకల్ని కొరుకుతది
అల్లాడే పేగులు ఆకలి నింపుకోని దీనత్వంలో కలికలి అయి
నీరసముతో నిద్ర పొరలు కమ్ముకుంటుంటే బతుకుదెరువు బరువాత అయితది
ఉపాధి శాట తంబాకుతో బీడిదారం జుడ్తూ కెనల్మని దగ్గుతూ
బీదరికం రోగాల కుప్పగా మారుతుంటది
మందులు కొనలేని రంది జీవితం రోజు రోజుకీ కృశిస్తది
ఎండిపోతున్న చెరువోలే మొండితనం పేరుకపోయి
ముడుసు బొక్కలు తేలి మెడలు సాగుతయి
దీవాళదీసిన ఆప్కోలా నేత మొకం
కూలిపోతున్న కుటుంబాల్లో ఏడుపు రాగబంధాలు
సిగ్గులేని ఖద్దరు
సుడిగాలి నేతలు ఇంటి మీద కడక్‌గా నిలవడ్తరు పరామర్శలో
వేసుకున్న ఖద్దరు నేత బతుకుల రాతల కోసం
ముండ్లయి నేతల్ని గుచ్చేదెపుడో . . . . ?
16.11.2008,రాత్రి  10:30గం॥లకు

**-సిద్దెంకి యాదగిరి**



# దండోరా

మోసపోయిన చలాకితనం దగాపడిన ఎదల్లో మొలకెత్తి
ఎత్తిన పిడికిట్లో ఎర్రెర్రని ఆత్మగౌరవం నీలిరంగు పులుముకుంది
నిప్పులు చెరుగుతున్న నినాదపు పౌరుషం
తరతరాల తిప్పలని దప్పు సప్పుల్లై వెంటాడుతున్న దండోరా
బాబాసాహేబు బాటలో సామాజిక న్యాయం
జనాభా పాల్ల మీద రిజర్వేషన్ పాల్లని
ఆగమైతున్న బతుకులకు ఆత్మగౌరవం నేర్పింది
మా'నవ'త్వము బోధిస్తూ . . .
మన దప్పులు మనకోసం మోగాలని ఏగాలని
తెలిపిన తత్వం బలతత్వం ప్రబలి
దప్పుకోల చాటింపులో మేలుకొన్న మాదిగ పల్లెలు
వర్గీకరణంతో సమానత్వానికి తోరణమైనయి
వైద్యం అందక రాలుతున్న పసి జీవునాల కోసం
అందరికీ వైద్యం సర్కారే అందించాలని
ప్రభుత్వాన్ని ప్రజల్లో బంధీని చేస్తే
ఆరోగ్యశ్రీకినాంది పలికింది
చట్టాలను ప్రశ్నిస్తూ
ప్రమోషన్ల రిజర్వేషన్లను ఆధారమన్నది
అణాగారిన కులాలకు అధికారమే ఆభరణమన్నది
వైకల్యాన్ని వినోదంకోసం హీనం చేస్తే
గుడ్డి బుద్ది చెప్పిన గురుతర బాధ్యత
పింఛను పెంచాలని ప్రజాపింఛమయింది
లేనివార్త లిఖించే అబద్ధపు జ్యోతుల్ని

బాడుగ నేతలన్నందుకు కిరాయి మూకలని
అక్షరాల పరాయితనాన్ని పగపట్టి ముద్దెరలు గుద్దింది
ఆత్మగౌరవం అవనతమైన జాతీయర్ఘుండా ఒకటేనని
తప్పు చేసినోనికి శిక్ష తప్పొద్దనీ
కల్లలాడే కలాలకు బేడీలు తొడిగింది
శెక్కిల్లు పట్టి శేరుగుద్దే యిద్దె వారసత్వాన్ని
పైస బలుపు శేరును ప్రతీకల వేరుని
చెక్క గాల్లని చేసే సత్త చూపింది
వర్గీకరణ చట్టంకోసం పొరుబాట్ల పట్టినం
సత్తా నూరిన కత్తికెరుకే
వద్దనీ వత్తాసు పలికే మూలాల్ని
లంద గోళెంల నానవెద్తం -
మురిగిన తోలును ముద్దుగజేస్తూ
సామాజిక న్యాయంతో సాగిపోతం రాజ్యాధికారంకై....

30.10.2008
ఉదయం: 6:00గం॥లకు

**-సిద్దెంకి యాదగిరి**



# కుల గర్వం

మా బతుకుల చీకటి నింపిన
కర్మ మొలదారం తెగ
లేనిది పుట్టించినోడు లేకుంటపోను
నిందెలు మోపినోడు బొంద మొయ్య
అంటరానితనం అంటగట్టినోని తీగె
గుంటుకు లేకుంట గాను
వల వల నవిసిన పశువులను
నెత్తురు సీముతో సచ్చిన గోదలమోత
తాళ్లుపేనిన చెప్పులు ముడ్చినా
యాతం బోసి మోట గొట్టిన చేతులు
ధూద్తుమని దూరముంచితే
బతుకే దుమాల్లం అనుకున్నంగని దుమ్మెత్తిపొయ్యలే....
నీరడితనం పంట పండించినా
కడుపు నింపలే
సపాయి, తలారి బతుకు చతికిలపడి
ఆకలి బాధల్ని తీర్చకున్నా ఇందేందనలేదు
చెల్కల ఏరుకొచ్చిన తీరొక్కపువ్వ
బతుకమ్మను పేర్చిన ఆనందం
సందడి లేకుంట చేసింది
మాలోల్ల చవితిలేదనీ
మాదుగులకు అన్ని పండుగలుంటయా అని దిక్కరిస్తే
కుక్కిన పేండ్లయి కుమిలినం

పునాదులు - గోపురాలు కట్టినం
పూజలు చేయనివ్వని పంచాంగం పగ
తంతెల నాటి నుంచి గుడితంతెలు ఎక్కలే
గుండంల మునుగనియ్యని గండం
గురుతుపెట్టుకొని గురుతు పెట్టాలే
శాతలు పంచుకొని పండించని పంట
పెరట్ల పెంటమీదికేలి రమ్మని
నిన్నటి బువ్వ దానం జేసినా
అట్టెట్ల అని అరికెలు పెట్టలే....
పుట్టింది మొదలు చచ్చేదాక సేవలు జేసే మమ్ముల
కాదని బతుక గలవా ?
మా అతారెలకు రేషమొస్తే
మెడబలిసిన కయిలి కోడేను అడుగు
తాళ్లతో పడగొట్టి కాళ్లు గట్టి
శేక్కిల్లు పట్టి శేరు గుద్ది గుణానికి తేలేదా ?
గుణానికి రాలేదా ?
ఎగిరిదుంకే దప్పు సప్పుళ్ల దింపుడుకల్లంజేసి
బోర్లేసి బొంద పెడుతూ మొలదారం తెంపి పూడ్చలేదా ?
పాణం పోయినంక పాతర పెట్టినట్లు
యిపుడు బతికున్నపుడే కులగర్వపు మెడల్ వంచమా?

02-02-2009

-సిద్దెంకి యాదగిరి



# చదువుతున్నం

ధర్మం ముసుగుల అధర్మం
కర్మపేరుతో నియంత్రణ కట్టడి
తరతరాల జాతి ప్రగతి క్రూరంగా అణిచిన
పద్ధతులతో హద్దులు గీసిన మనువు
వాని చాంధస వాదం
మమ్ముల మా జాతిని వొంగదోలింది
ఉమ్మి ముంత ముక్కు కొక్కెం
అడుగుల్ని మలిపే ఆకులు కట్టించి
పుట్టు వన్నెలు మాయం జేసినోళ్లు
అక్రమ పెట్టు వన్నెలు అద్దింద్రు
యిప్పటికీ కుల వివక్ష వెంటాడుతూంటే
తల కాటెక్కుతూన్న బాధ కన్నీల్ల బాధ
కత్తులు అయి కోస్తుంది మనసును
అక్షరాలు దిద్దితే కోయబడ్డ వేళ్ళు
ఉచ్చరించినందుకు చీల్చిన నాలుక
వింటున్న చెవుల్లో సలసల కాగుతున్న సీసం
అందుకే మా కలాలెపుడు అస్థిత్వాల అస్థిరతవైపు
నుంచి నిలదీస్తయి
బుద్ధినేర్పిన బుద్ధుని తొవ్వలో
మువ్వలా పూలే శక సంస్కర్త సవ్వళ్లు విన్న
ఆకలికేకల విద్యావేత్త కార్యదీక్షతని చూపే వేలు
రాజ్యాధికారం కోసం

రకరకాల రంకు పాఠాలు చదువుతున్నం
బొంక నేర్చిన పీఠాలు చదువుతున్నం
సమాధి అయిన చోటునే మొలకెత్తుతున్నం
అసలు చరిత్ర తెలుసుకొని
మా భవిష్యత్తును లిఖిస్తూ
మా మూలాలను పరిశోధనా పాతాళ గరిగెతో
మీ పురాణా పుల్ట్యాంక్ల్లో దేవుతున్నం
ఈ దేశప్పునాది మేం
అసలు మూలవాసులం
జంబూద్వీప పరిపాలక వారసులం
జాంబవులం
ఓ... అనాగరిక మనాది మనువా
నీ జాతకం చదువుతన్నం
మూసిన పానాది తెరుస్తున్నం
అడ్డుపడాలని ఆశిస్తే
సల సల కాగే సీసం,
ఉడుకుడుకు...... వగైరా మేం పోస్తం
కలసొస్తె కౌగిలించుకుంటం
కలహిస్తే కాలరాస్తం

04-03-2009

**-సిద్దెంకి యాదగిరి**



# మారిపోతున్నాను

మారిపోతున్నానే..?
ఔను మారుపోతున్నాను
నన్ను నేను **Hypnotise** చేసుకుంటున్న
మనిషిని, మనసుని, మస్తిష్కాన్ని
ఆలోచనను ఆచరణను ఒకటేమిటి
'టోక్' గా మారిపోతున్నాను
జోక్‌లు మీకు సరదాగావొచ్చు
మారడమే నారోకు
ముసుగు పరదా మాటుగా పరిగెడుతున్నాను
ప్రశ్నలొద్దు
ఊసరవెల్లి ఊరికే మార్చదు రంగు
మనుగడ కోసం
వ్యాపార వస్తువవుతున్న మనిషి?
నైతిక విలువలకు నహి చెప్పను
భౌతిక విలువలకు **Bye** లతో
బహుబాగా మనసు మార్చేసుకుంటూ
అంతరాన్ని అంతరంలోనే పేర్చుతున్నాను
నీతులు వల్లించే నేనే
ఆత్మ గౌరవ జాతరకు గోతులు తవ్వుతున్నాను
వినిమయ వస్తు సంస్కృతి విషం
సరళీకరణ సహవాసం
గ్లోబలైజేషన్ గొడ్డలి వేటుకు

మారటం ఎంత సహజమో
మార్చుకోవటం కూడా అంతే సహజం
భావాల్ని బహుచక్కగా చెక్కే నేనే
అక్షరాల అల్లికను తెంపి
పదాల పొదకు అగ్గివెడ్తూ
మాడిపోతున్నాను మారిపోతున్నాను
ఒకటే బాణం, ఒకటే మాట, ఒకతే భార్య
మోసపు మాటలు,
సరసపు రాండ్రు సంఖ్యకు మించి
అవసరాన్ని బట్టి అవతారం మంచిదే...?
వినమ్రంగా నమస్కరిస్తున్న
గౌరవ మిస్టర్ పూలే మన్నించు
మీ వారసత్వానికి గండీ కొడుతున్న
నేనిపుడు కిరాయి గది కోసం
ముదిరాజు అవతారమెత్తిన
పరాయి మాదిగ పంతుల్ని

08-08-2012.

**-సిద్దెంకి యాదగిరి**



# విశ్వమానవ విపంచి

మనువాద రొంపిలో జాతి మునిగి వున్నపుడు జన్మించినవు
అంటరాని అలికిడి విని కళ్లు దెరిచినవు
ఊయల్లోనే శిశువువై సమానతల కోసం ఆలోచిస్తూ
అక్షరాల వెలుగుల్ని పేర్చి నవయుగానికి నడుంకట్టిన చక్రవర్తి
కన్నీటి సిరాచుక్కల కవికోకిలవై నిత్య వసంతం కోసం
బిగిసిన పిడికిట్లో బీజాక్షరాల విత్తనాల్ని ఎగజల్లుతూనే
కలం గళానివై సాహితి తారగా గగనమెక్కావు
ఉద్యోగాలు చేస్తూ అద్దె గదులకై ఆరాతీస్తుంటే
నాల్గుతలల నాగరాజు ఇంకా బుసకొడుతున్నడు
కుల వివక్ష విస్తరిస్తూనే వుంది తండ్రీ
ఆవేశం ఆగ్రహం రెండంచుల తల్వారై
కసితీర ప్రతీకారం తీర్చుకుంటుంటే
రాత్రికి రాత్రే బతుకులు చితికిపోతున్నాయి
కారంచేడు, చుండూరు, పదిరికుప్పం, వేంపేట, లక్ష్మింపేటలు
చారిత్రక నెత్తుటి ప్రవాహాలై
కుతికెల్ని హలాల్ జేస్తూనే వున్నాయి
వాకపల్లి కన్నీళ్ల జలపాతాల చప్పుళ్లు
కోర్టుల చుట్టూ గింగిర్లు కొడుతున్నా
ఈ రాజ్యాంగ గగన గంగ కరుణిస్తనే లేదు తండ్రీ
నీవు పంపిన ఖగరాజ్ఞి కబురు విన్న పినాకపాణి కరిగిపోయెనేమో
కరుణించుమని వేంకటేశ్వరుని వేడుకొనెనేమో
ఏడుకొండల సంపన్నుడు వాడవాడలా

దళిత గోవిందంతో దర్శనమిస్తున్నడు సపరేటుగా
మధురకవీ మనువాద నిరోధి మనవాద సారధి
గబ్బిలాలు యింకా మనసు చీకటి గుహలో మగ్గుతున్నాయి
బంగరు రంగుల మేల్చిన్నారి గిజిగాడు
ముండ్ల తుమ్మకొమ్మకు కండ్లు తెరుస్తున్న
సంక్షామాలే వెంటాడుతున్నై
ప్రస్తుత అరాచకాల్ని అనేకులు ఆలపిస్తూనే వున్నరు
విశ్వనరుడా !
విశ్వమానవ విపంచి
మానవతా విలువలు పెంచుకోవటానికి
పరస్పరము పంచుకోవటానికి
సమానత్వమనే మానత్వ సాహితీ గంగతో
ప్రతి హృదయాన్ని శుద్ధీకరించు తంత్రీ

28-08-2012.

(జాషువ పరిశోధనా కేంద్రం తెలుగు అకాడమీ వారిచే గుర్రం జాషువ117 వ జయంతిని పురస్కరించుకొని హైద్రాబాద్‌లోని జూబ్లీ హాల్‌లో సన్మానం)

"విశ్వనరుడు - నవయుగకవి చక్రవర్తి జాషువా" తెలుగు అకాడమీ పుస్తకంలో ప్రచురితం

**-సిద్దెంకి యాదగిరి**



# జాంబవ గ్యాణం

జాంబవ గ్యాణం
దొప్పల పెట్టే
అగ్గిల కాల్సిన సియ్య
పచ్చిమాంసం తున్కల్
ఎండల దండెమ్మీద ఆర్చేస్తే
అట్టితున్కల్ గట్టిగయితయి
లందగోలెంల మురిగిన తోలు
రకరకాల అడుగులకు తీరు తీరు చెప్పులు
తయారు చేసే దేశవాలి పరిశ్రమ
సింత గింజల అంబలి పూసిన కుదురు
కడెం నుల్కతాళ్లు
మూడు పొయిరాళ్ల మీద కుదురును
బరువు యిసురాళ్లు ఒకదగ్గరికి గుంజితే
దాటిచ్చి కొట్టే దప్పు సప్పుడు
మెప్పులు పొందుతూ పరిస్థితిని తెలుపుతుంటే
ఊరు ఊరంత ఏకమైతది
దుంకిపోయే దున్నపోతూ
మెడబల్సి ఎగిరిదుంకే కయిలి కోడే
వాటమ్మీద గుద్దే గూటంతో
బుద్ధి తెచ్చుకొని విద్దె నేరుస్తది
సెప్పిన పనిచేసే బుద్ధి నేరుస్తది
కరకర నూరే ఆరే తిత్తిదీసే కత్తి

యిడిపించిన తోలుకు
సెప్పులు ముడిసే పనితనం యిగురం అద్దితే
సెప్పు సప్పుడు కిర్రు మంటది
తొడిగె కాళ్ల కాందాన పెరుగుతది
నీట మునిగిన తొండం మోట బొక్కెన
పైకెత్తి పోసే నీళ్ళతో పాటల రాగం
పుట్ల పంట పండిస్తది
కడుపు నింపని మాయితనం
దయమరిసినందుకు కన్నీళ్లు నింపుకుంటది
చీరిన నార
కరిపేనిన తాడు
అరచేయిల తాల్సిన నుల్క
సుఖానికీ, పంటకూ ఉపయోగపడుతది
మాయదారి ప్రపంచ మార్కెట్ల
జాంబవ గ్యాణం
సోయిదప్పి సొట్టపోతూ అంబాడుతుంది
పనితట్ట సోచాయించి తెలివికొచ్చి
ప్రపంచీకరణ తెలివి అంచుల్ని తెగ్గోస్తే
లోకం తొడిగె చెప్పులకు
ఆముదం అద్దితే శోకం లేకుండా.. మరో రకమైతది

సాహిత్య ప్రస్థానం మాసపత్రిక – మే,2008

**–సిద్దెంకి యాదగిరి**



# జెల్లికం జెం

గుడిసె ముందటి ఆకిట్ల
ఆసాములు నిలబడితే ఆనందం
తిప్పల మరిచిన కష్టం
తిన్నంత ధైర్యం
ప్రపంచీకరణ ప్రభావం
గుడిసె కమ్మల స్థానంలో
సిమెంటు రేకులు ఎంత అలుకగ వొచ్చినయో
అంత అలుకగనే
మిగ్గుపెట్టి ముడిసే అతారెలు
సాంచెల శానితనమ్ముందట
సిగ్గు ఒదిలి తలదించుకుంటున్నె
బువ్వ పెట్టాలని అతారెలు
అడ్డామీది మోరిపక్కకు
ఉంగుటం ముక్వారు మొలలతో
పాలిష్ వేయాలని ఆరాటపడుతూ
చెత్తిరి కింద మునిలా తపస్సు చేస్తున్నె
మంచికి చెడుకి
నిలువెల్ల లొల్లిపెడుతూ లడాయిజేసే దప్పు
ఊటబాయి పెయి శమటజల్లులు
దెబ్బ దెబ్బకు తీరొక్క తరీక కురిసేది
కంటిరెప్పలతో తిప్పలపడితీసినపుడు
సూదిలా గుచ్చుకునే రూపాయిలోటు

చింతలేదని అంతా మంచిదే అనుకుంటుంటే
మా పని తనానికి కాని ముల్లు యిరిగి కతమైంది
మర్నాగి గ్లోబలైజేషన్ నీడ
కాషియో బ్యాండ్ మేల తాళాలతోటి
ఏగే దప్పు జీవునమీ్మద ఎనగర్రకూలినట్టై
బొక్కల మండె ఎత
ఒట్టి బూడిదలా మిగిలింది
అక్కరకు రాని ప్రైవేటీకరణ
అడుగులు కోసి చెప్పులు జేసి
తిరేట్ల కుదురుకు నట్లు తింపుదాం
జెల్లికం జెం. జెల్లికం పప్పడమంటూ
ఎగురుతూ చాటింపు జేస్తూ
మొద్దు మెదల్లను మేల్కొల్పుతూ
బొక్కలు యిరిసి బొండిగె పిసుకక
మనల్ని మనకు దూరం చేయకముందు
ఓట్ల మీద గూటం దెబ్బలుగుద్ది
గుణానికి తెద్దాం

24.06.2009
(ఆగష్టు-09 సాహిత్య ప్రస్థానంలో ప్రచురితం)

**-సిద్దెంకి యాదగిరి**



# అట్టి తునకల కూర

మా అవ్వ! అట్టి తునకల కూర
గట్టిగ గంటె తిరుగకుంట ఒండు
లవంగాలు నూరి మసాలా చేసి
యిలాచ్చిలతోటి అంత కమ్మగ జేసు
మా అయ్య! లొట్టలు కొట్టుకుంటు తిను
బుక్కకో తునక నోట్లెకు పోవాలే
లేకుంటె తిక్కపుట్టి
కుక్క తిట్లు తిట్టు
మా తాత! తాడు పట్టుకుంట
పెనమ్మీద ఏంచుక తెచ్చిన తునకల్ని
కర కర నములు
దవడే... ఆడకపోతే ?
తాడు అయిపోయేదాక కిరికిరిపెట్టి
ముసల్దాని సుట్టాన్ని, సట్టాన్ని
పొట్టు పొట్టు తిట్టు
మాదిగింఢ్లల్ల
సంటిపోరగండ్లకు
కార్జం ఉప్పుకారంల ఉడికిచ్చి
ఉగ్గు బువ్వతోనే షురువు
సుట్టపొడొస్తే
సెవుల ఎసులల
కూర కుత కుత ఉడికియ్యాలే

లేకుంటే
ఆఖర్కి అట్టి తునుకుల దప్పడం చెయ్యకపోతే
సుట్టిరికం ఉట్టిదే
బడిలె దోస్తుగాండ్ల మాటలు వట్టి
యిసుక్కుమనిపిచ్చి నేనేగాక
ఇంట్ల కూర ఒండనియ్యలే తిననియ్యలే
పెద్ద కూరనంగనే పాణమంత ముక్కిరిసినట్లువు
అపుడు నేను తినంగ ఎక్కిరిచ్చినోల్లు
ఇపుడు కళ్యాణి బిర్యానికి కెగవడ్డరు
ఎర్కకాంగనే ఛీ అని చీదరిచ్చుకున్నందుకు
నొట్లె బుక్క ఎత్తగొట్టె పాపాత్మునివి.... అనే తిట్లు పడ్డ
సదువుకొంగ దోస్తుల రూంలకు పోయిన
కుక్కర్ల వండి తెచ్చి ఒట్టేసి తినిపించిండ్రు
తిన్నంక తెల్సెగుట్టు
అపుడనిపించింది
సప్పలు పీక్కతినే సంస్కృతికి దూరమై
సప్పటి కూరలకెందుకు ఎగవడితిమా అని

సాహిత్య ప్రస్థానం 07-09-2008.

**-సిద్దెంకి యాదగిరి**



# బాడుగ అచ్చరాలు

ఉద్యమాలకు ఉప్పందించే
గొంతుకలు మూగవోయినపుడు
నినాదపు నిప్పు రాజేసే అచ్చరాలు
ఇయ్యాల్ల ఆగమైతన్నయ్
మూఢ నమ్మకాల ముసుగులో
పుల్కాషితనం మునిగిపోతున్నపుడు
తల్కాయెల్ని మేలుకొలిపే
కోడికూత అచ్చరాలు
వాడిపోతన్నయ్
ఓట్ల ముందు సెప్పిన మాటలతో
గద్దెనెక్కి తూట్లు పొడిచే నాయకులు
యెన్నుపోటు పొడిసిన రాజకీయ రాగంతో
బోగమైనోల్ల మూతులు నాకుతున్న అచ్చరాలు
నియ్యతిని పాతరపెట్టి బేనియ్యతిని ఊదరగొడ్తయ్
అంగట్ల బొమ్మలోలే
అచ్చరాలు అమ్ముకుంటూ
పజా ఉద్యమాల్ని నమ్ముకున్న నాయకులు
'బాడుగ' నేతలని వక్రీకరిస్తే
ఒక పార్టీ నుంచి ఇంకోపార్టీకి
అమ్ముడుపోయిన అగ్రవర్ణ నేతలను
'బాడుగ' నేతలని రాయడానికి అచ్చరాలకు బలముందా?
ఉద్యమమే ఊపిరిగా బతికెటోల్లు

ప్రజా సమస్యల పరిష్కారానికి
గాంధీ తొవ్వల వోయే బడుగు నేతలను
'బాడుగ' నేతలన్న కిరాయి అచ్చరాలు
బడుగుల ఉద్యమాల్ని అణచాలని కాకపోతే ఇంకేంటిది?
నోరుందని యిరాంలేకుంట ఒర్రితే
నోరుగాదా? మోరిగాదా?
అగో...! అచ్చరాలు గూడా
రీతి రివాయి లేకుంట నీతిమాలుతున్నై
పద్ధతి పాడు లేకుంట బుద్ధిమాలుతున్నై
సూసుకుండ ఊకుండెతందుకు
ఇదేమన్న నాట్కమా...?
పట్ట సేసెతందుకు అచ్చరాలు
ఒక్కరియా.... యేమి ?
కలం సేతులుందని
అడ్డం దొడ్డం ఎన్ని రాసినా
కొనాఖర్కి కాలం
అవద్దమో... నువద్దో ఎర్కజేత్తే
యిజ్జతీనం లేని అచ్చరాలను
లోకం గుద్ది గుణానికి తెత్తది
బాడుగ అచ్చరాల బతుకు
పచ్చి కుండోలె యిచ్చుకపోతది

14.06.2008
(సూర్య పత్రిక)

**-సిద్దెంకి యాదగిరి**



# సమ్మెపోటు

ముసి ముసిగా నవ్వుతూ
ముచ్చటాడే ముఖ్యమంత్రి గారూ
అసలు మూలకం చెప్పరాదూ ?
ఉపాధ్యాయులను చర్చలకు పిలిచి
తియ్య తియ్యటి హామీలతో మరిపించితివి
న్యాయానికి నడుం కడ్తాని వాయిదాలెస్తుంటే
నీ వాలకం తెలియక గడియారంలోలకమైతిమి
కోరక ముందే కొత్త పియార్సీ
ఇండ్లులేని ఉపాధ్యాయులకు యిండ్లు
ఏకీకృత సర్వీసా ? అదెంత సేపు ?
98 క్వాలీ ఫైలకు కొలువులని ఊరడిస్తివి
పాదయాత్రల చిలుక పలుకులయితివి
గుండెల నిలుపుకొని అధికారం అంటగడ్తె
కంటికి కడివేడు నీళ్లతో మంటపెట్టవడ్తివి
బడ్జెట్ లక్షోకోట్లు దాటిందని
నిమిషానికి లక్ష చొప్పున ఛానెల్ల ప్రచారమాయే
నోషనల్ ఇంక్రిమెంట్లకేమో 116 కోట్లకు “నో” చెప్పవడ్తివి
జలయజ్ఞంల షేర్ యియ్యిమంటలేం
కాంట్రాక్ట్‌లు మాకే కావాలని
సెజ్‌ల పేరిట భూముల్ని
అమ్మిన సర్కారు భూముల్ల భాగము అడుగట్లేదు
న్యాయమైన కోరికల్ని గురుదక్షిణగా నెరవేర్చు
అప్రెంటిషిప్‌ను ఎత్తెయ్యి మంటున్నం

నోషనల్ ఇంక్రిమెంట్ల కోసం
అన్నింటికి మించి సర్వీసు రూల్స్ కావాలంటున్నం
పాఠశాలల్ల మౌళిక వసతులు అడుగుతున్నం
హామీలొద్దని జీవోలు ముద్దు అంటున్నం
ఒకటా... రేండా... నాలుగున్నర ఏండ్లల్ల
సమ్మెబాట పట్టినా సమాధానం లేకపాయే
మెత్తమనసు గురువులు
ఉత్తవాల్లని అంచనా వేయకు
చిత్తుకాయితాలుగ మలసి చెత్తబుట్టలోయేసి
పత్తాలేకుంట జేస్తే సత్తా మాకుంది
ఎర్రగీత పెట్టి అడ్మీషన్ రిజిష్టర్ల పేరుతీసినట్లు
ఓట్లతో కొత్త సర్కార్ షేరీక్ చేసకుంటం
ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే
బుద్ధితో దేశాధినేతవైనా,ముఖ్యమంత్రివైనా
నీగురువుకు నీవు శిష్యుడివే
అప్పటి గురువు రుణం ఇపుడు తీర్చు
గురువులకు చరిత్ర బోధించటమే గాదు చరిత్రను మార్చటం
పాఠం చెప్పడమేగాదు గుణపాఠం చెప్పడం
మేల్కొల్పడం, మేలుకోవడం ఏలుకోవడం
ఓట్లు వేయడము ఓట్లకు తూట్లు పొడవడము తెలుసూ
ఎత్తిన పిడికిలి దించం
అనుకున్నది పొందేదాక సమ్మె ఆపం
ఉద్యోగి గోస తగిలిన రాజ్యం
ఉపాధ్యాయుల ఉసురు తగిలిన శిష్యులు
సర్వనాశనం
24.07.2008 (రాత్రి 10:00గంIIలకు)



# ఇంటి దొంగలు

అనుమానం కలిగితే తకాయించి అడగవచ్చు
అబద్ధమాడితే గుద్ది బుద్ధి చెప్పొచ్చు
అవుతలి దొంగయితే అరికెలు పట్టొచ్చు
యింట్లోల్లు వొాయి దొంగల్ల గల్సిరి
తకాయించి అడిగితే బుకాయించి చెప్తండ్రు ?
బుద్దులు మనం చెప్పితే సుద్దులు మనకే చెప్తండ్రు
గుద్దితే గుణమిడిసి బద్మాషులైతరని
బతిలాడితే అలుసాయే
భయపెడితే కంట్లె నలుసాయే
తలుపు పెట్టి అడుగుతుంటె
కొలుపు పెట్టి వింటుండ్రు
ఎపుడు జూసిన గోడమీది పిల్లులోలె ఉంటరు
మల్లెప్పటోలే మాకు వొంకలు వెద్తరా... అంటూ
ఒక్కతీరుగ బొంకుతూ
అదిష్ఠానం యేసిన బొక్కను కంకుతూ
పట్టుకొచ్చిన కుక్కోలే వొచ్చి
పదిమందిల పంగనామాలు పెట్టుకొంటండ్రు
సాటుకు వొాయి తూడ్సుకొని
మైసమ్మ దున్నపోతేలే మారేసి సూత్తండ్రు
దుడ్డె పెదవుల్తో నీతులు వల్లిస్తూ
పదవుల కోసం పెదవులు మూసుకుని
అధికారం కోసం అవులగాల్లై

ఓట్లేసిన ప్రజలకు సలాం జేస్తున్నట్లే
పార్టీలకు గులాం జేత్తంద్రు
సర్కారు సంకల సన్నాయి నొక్కుతూ
పార్టీ ముందు పొరుదండాల్దీస్తూ
పగదారునితోటి రాస్కపూస్క తిరుక్కుంట
ఎవంది వాడే గోక్కుంటడు
ప్రజలు ముందు "జై"
పార్టీల ముందు "నై" అంటూ
కందికట్టెకు కనరుండది
పందికొక్కులోలె బల్సిన నాయకులకు
ప్రజలు తిరుగుబాటు ఝుండాలైనపుడు
ఓట్లకు నెనరూ ఉండది
రాజకీయానికి ఆ కనరూ ఉండది

16-2-2010
04-2010 "కవితా ఓ కవితా"లో ప్రచురితం

**-సిద్దెంకి యాదగిరి**



# ఓ...యుద్ధం

ఉస్మానియా విద్యార్థుల చైతన్యం
దోసిలితో ఉద్యమాన్ని ఎగజల్లుతూ
ఉద్యమ ఉగ్గుబువ్వ మొలక అలుకుతరు
అన్యాయం పై తిరుగుబాటుతో
అగ్గిపిడుగై భగ్గుమంటది
ఆశయాల నిప్పురవ్వల్ని రగిలించి
తెలంగాణ తెగువకు ఉదాహరణవుతది
వందేమాతరం నుంచి నిరంతరం
ఓ యుద్ధభూమి
లక్ష్య సాధనలో
బూట్ల తొక్కుడుకు
బులెట్ల వానకు లాఠీ దెబ్బలకు
నీళ్ళ బాష్ప వాయువుకు
ఎదురు ఈదుతూనే శక్తి మథనంతో
రాళ్ళ వానయి కురుస్తరు
పరాయిపాలన ఆజ్ఞల పాపానికి
చిప్పటోపీల పగకూ, లాఠీల ప్రతాపానికి
ఇనుపబూట్ల కింద నలిగిపోతున్న
ఆఖరు గడియలైనా లెక్కచేయరు
దారిపోరు గురి ప్రత్యేకరాష్ట్రం
రాలుతున్న కన్నీల్ల ఆకాంక్షలకు
సజీవ అగ్గికలల అసలురూపమై
పెట్రోల్ మంటల్తో పోలిసు గుంపు మీదికి పరుగెత్తి
అమరత్వం నిలువటద్దమై నిలిచింది

మీ వెంటే మేం అని
శవ ప్రమాణాలు చేసిన నేతల ఎతను
అక్కున చేర్చుకున్న విద్యార్తిలోకం
అక్కరకు రానపుడు అడుగడుగున ఉరిలా బిగుసుకుంది
దొంగ దీక్షలతో లొంగి పోతున్నపుడు
మా నెత్తురు తాగి విరమించుమని విసిరిన సవాల్
శవయాత్ర దింపుడు కల్లంతో గుద్దిగుణానికి తెచ్చినపుడు
బుద్దితో సాగిన దీక్ష
అణువణువు ఉద్యమ రేణువుల్ని రేపితే
ఢిల్లీ పీఠం కంపించింది
369మంది విద్యార్థి అమరవీరుల రక్తం
సునామి కెరటాలై రాష్ట్రంకోసం దేహంలో ప్రవహిస్తూ
ఉసిగొలుపుతూ ఉద్యమ వారసత్వాన్ని నిలుపుతుంది
కుంజీయిస్తే ఎగిరి దుంకె ఆటబొమ్మలుకారు
ఆడిస్తే ఆడే తోలు బొమ్మలు అంతకన్నాకాదు
ఉస్మానియా విద్యార్థులు ఉద్యమ పాఠాలు నేర్చుకోరు
ఉద్యమ పాఠాలు నేర్పుతరు
ఇపుడు ఓ.యు హైద్రాబాద్‌లో లేదు
ఊరూరుకు విస్తరించిన శాఖ
తుపాకి గొట్టాలు
ఉద్యమాలకు తూట్లు పొడవచ్చు
తూట్లు పడ్డ పొక్కల ఉస్మానియ పొద్దుపొడుస్తది
నిఖార్సయిన విద్యార్థి ఉద్యమాలు
తెగించి కొట్లాడుతయి
తెలంగాణ రాష్ట్రాన్ని సాధించిపెట్తయ్
02-02-2011 ("ఓ యుద్ధం" దరువు కవితా సంకలనంలో ప్రచురితం)



# మాదిమాకు

ఉపన్యాసాలన్ని ఉన్కమీది రోకలై
అందితే చాలు మైకాసురుడైతాడు
మనసులు ఆకట్టుకుంటడు
బుద్ధిమంతుని యేషం
ముద్దుకు మొద్దుమేధావి
యిగురంలశేబ్బాసనిపించుకుంటాడు
నీతిపారాయణమే 'జయ'మని
వ్యాసాలై పేపర్లో ప్రకాశిస్తాడు
నోరుదెరిస్తే చట్టం సమభావన
దోచుకుంటున్న నోటికాడిబుక్క
దాచుకుంటున్న తెలంగాణ ధనం
మలుపుకపోతున్న నీళ్ళు
అడుగున తొక్కిపట్టిన ఆరుపది జీవో
ఉద్యమం గురించి చెప్పకున్నా పర్వాలేదు
ఆరోపణలు డబ్బలేసి ఊపుతడు
ఆయన సృష్టి రాజ్యాంగం
సుపరి పాలన బ్రహ్మావతారం
తనవాక్కు మీద చట్టం, దేశం నడవాలనుకుంటడు
గాంధీకి అహింసనేర్పిన తాత
అంబేద్కర్‌కు పాఠాలు చెప్పే స్థాయి
నీతిమంతున్ని సత్యవంతున్ని అని ఆయన పీలింగ్

\- \- \-

అపశకునపు నిందల ధాటికి
అరచేయిలు దిమ్మీసలై దాడిచేసి
ఆ బాకీ తీర్చుకున్నయ్

– – –

మీడియాతో సహా నోర్లన్ని ఒక్కటై
దుర్దినం
చీకటిరోజు
చరిత్రలో ఘోరం
బ్లాక్ డే...... ఏవేవో కాకి పలుకులు అయి
ప్రసంగం చదివిన అయ్యగారు
పాపులం మన్నించండి

– – –

తల సూచిక నోరు
నోరుకు ఊరుకు సంబంధం
తప్పుకు తగిన శాస్తి
తప్పులేకుండా ఏండ్ల బాధ ఎట్ల ఎల్లదీస్తన్నం
వేరుపడాలని బలిపీఠాలెక్కవోయే కాళ్లు
సంపుడు సురువుజేయక ముందే
మాది మాకు మీది మీకు

వీర తెలంగాణ మాసపత్రిక 2011 మార్చి మాసంలో ప్రచురితం

**–సిద్దెంకి యాదగిరి**



# ఉద్యమ సూర్యుడు మరోలా ఉదయిస్తడు

ఇడ్లీ సాంబారు గో బ్యాక్
నినాదపు నిప్పురవ్వ రగులుకొని
తెలంగాణ కోసం లాంగ్ వే అయింది
వలస ప్రజల వక్రబుద్ధిని
సీమాంధ్ర అధికార దాహాన్ని, దోపిడీ వ్యూహాల్నీ
నీళ్ళను, నిధులను, సంపదను
తరలించుకుపోతున్న అక్రమ వాటాల్ని ప్రశ్నించి
మాటల గిర్మిట్లు దించి తూటాలు పేలుస్తడు
మన ప్రాంతం అడుగుబోయిన గుల్ల అవుతుందని
కుల్ల కుల్ల మాట్లాడుతూ
సుప్రభాత తెలంగాణ స్తోత్రమై
చెవులల్ల యిల్లు అయి ఉపదేశిస్తడు
కలల్ని కల్లలు చేస్తున్నపుడు తన కళ్లతో చూపుతూ
ఈ లొల్లి పోవాలంటే ప్రత్యేక రాష్ట్రమే దిక్కు అన్నడు
కడుపుల కత్తెర్లు నోట్లె బెల్లాల కపటాన్ని
కసిగా హేళనతో ఎక్కిరిస్తడు
ఆఖర్కి తినబోయె తలె మత్పరిస్తంద్రని
దోచుకు పోయేటోని దోస్తాన ఎందుకనే ప్రశ్న?
బొగ్గుమనది
కరంటి పుణ్యానికి యిస్తరట
నదీనీళ్లు మనయి పారకం వాల్లకు
కొలువులు మనయి నౌకర్లు వాళ్లు

అన్యాయమన్నా కాకామ్మ కబుర్లే జవాబు
సమైక్య ప్రభుత్వాల దొంగాట నాటకం
అన్ని పార్టీలు ఒక బూటకం
నిధులు వాళ్లకు కన్నీళ్లు మనకి అని
ప్రశ్నలకు పురుడు పోసిండు
మన ఓట్లు మనకు వన కూడాలే
మన నీళ్లు మనకు పారుతయ్
మన కొలువులు మనం జేస్తం
మనల్ని మనం ఏలుకోవాలి అని బోధించే జయ శంఖం
ఉద్యమ రవి జయశంకర్ సార్ గారు
విద్యార్థి, పండిత, పామర, మేధావి నేతలకే గురువు
తన ఉపదేశమే ఉద్యమం సందేశమే సగం బలం
తనువు ఉన్నా లేకున్నా నడుస్తున్న కొట్లాటకు ఊపిరి
ఆశయాల వల విసిరి
అరచేయి అధికారం అడ్డుపడితే
తెగింపుతో పోరాటం ముగించాలని
శనార్థి కోరిన ఉద్యమ సూర్యుడు మరోలా ఉదయిస్తడు

ప్రొ॥ కె.జయశంకర్ సార్‌కు నివాళి

**-సిద్దెంకి యాదగిరి**



# రైతు ఎత

కాలం చినుకై రాలనని
వరుదలయి పొరలనని పగబట్టిన సంగతి
వానకై ఎదురు చూస్తున్న రైతుకు ఎరుకలేక
తేలిపోయే తెప్పలై మనసు చెంచరిల్లుతంది
దీపం మొకాలైన కండ్లు
ముండ్లు అయి వొత్తుతున్నయ్
పోటో దీసినట్లు రెటీన పొర మీద
ఏడిసిన కన్నీళ్ల చారలు
చెక్కిల్ల మీద ఎండుకపోయిన ఎక్కిల్ల దారలు
ఎతల ఆవిరికి అద్ధం పడుతున్నయ్
ఉడుకు దుక్కిల ఉడికిన విత్తునాలకు
దారెత్తి జీవిగంజి తన శమట జాలుతో కలిపి
బతికించటం కోసం బహు కష్టాలు దీసిండు
ఫలితం లేక పరేషాన్ల పడ్డడు
మట్టి పొత్తిళ్లను నిమురుతూ
బాలింత నొప్పులు తీసుకుంటూ
మనసు కలికలి అయి వొల పోత్తండు
ఎదిగీ ఎదగని పంటకోసం
పొద్దంత ఎరువు కోసం తవుసుదీస్తడు
పరువున్నోందే రాజ్యము అయి
అధికారమున్నోందే భోజ్యము అయి
కొరత పేరుచెప్పి తలా రెండు కొలతలతోయిస్తది
దొడ్డిదారిన పోయే సరుకును అధికారం సాగదోలుతది

యిత్తునాల గోదాం
యిగురంతో ఉత్తచేతుల గాకుంట పంపుతది
కుతి ఆర కోరె రైతుల మీదికి మితి మీరుతది
తుత్తునీయులు చేయుటకు ఎత్తులు ఏసి
అయినోని పంచన జేరినపుడు
టోపీల గుంపు లాఠీలతో వాతల్ పెడ్తయ్
ఉన్నోని ఊడిగం జేసే బ్యాంక్‌లు
వసూళ్ళ కోసం బక్క రైతుల్ని చూసే వరకు
యెర్రిలేసి యెంటవడ్తయ్
ఎముకల పూలుగునైన జుర్రుకోవాలని
పాణం దీసుకునే ఎల్యం రాళ్లు విసురుతయ్
పెండింగ్ పడ్డోల్లకు రుణమాపి
బాకీ తీర్చినోల్లకు మోచేయి
అరచేల హామీల వర్షం దులుపినోడు
అదే చేత్తో రైతు నాయకులకు
చెక్కరి పోసి, చెక్కిలిగిలి జేస్తడు
పొత్తులు కలవకుంట పొగవెట్టి
ఐక్య పోరాటాలకు అడ్డుపడుతడు
రైతులారా . . . !
రైతు రాజ్యమని చెప్పుక తిరుగే సర్కార్ మోసం మీద
కొల్లగొట్టిన ఓట్లతో తిరుగుబాటు జేద్దాం
దొమ్మరోగం పశువుకు చేసే చికిత్సతో
సర్కార్ అన్కల గుద్ది చికిత్స చేస్తూ
ఎద్దునూ ఎవుసాన్ని కాపాడుకోవాలి
07-07-2011

**-సిద్దెంకి యాదగిరి**



# దోఖాభిప్రాయము

పూటకొొకటి, ఘడియ కొొకటి
గంటకు పొంటెకు ఒకటి గాదు
పొందకుంట పొసగకుంట
ఎన్ని కమిటీలైనా ఏయండి
ఎలుకలుతినొద్దని పిలులకు ఏకాభిప్రాయం
దోచుకపోవద్దని దొంగలకు జ్ఞాన బోధ
ఎన్నైనా చెప్పండి ఏకాభిప్రాయము వస్తదేమో ?
కుక్కతోక లక్షణం ఎంతో
కక్కుర్తి సీమాంధ్రుల కుట్రలూ అంతే
తెలంగాణ ఉన్నదంత దోచుకోవాలె
పాయిద లేకుంట జేయాలనుకునేటోల్లకు
ఏకాభిప్రాయమంటే ఎసరురావట్టె
వంచించటానికి ముంచటానికి
మాది మాగ్గాకుంట పంచుకోవటానికి
మీకందరికి ఏకాభిప్రాయముంటది
మాకొరకు మాత్యాగాల తోరణాలు చూడు
69లో 369 మందిని కాల్చుక తిన్న సర్కార్
బతికి ఉన్నవాల్ల బట్టకాల్చి మీదేసింది
నడుస్తున్న చితిమంటలయి
నినాదపు సెగలయి కాలిపోతూ
చరిత్రమొకమే గాదు
మీ ముకాలు కమిలిపోతయ్

నిజాన్ని తోసెయ్యకు, తొక్కెయ్యకు
పురుగుమందు తాగి నురుగులు గక్కిన జీవనాలు
సూసైడ్ నోట్‌లయ్ జీవి స్తయి
మానవత్వముందా
600 మంది అమరుల ఆత్మఘోష విను
ఉరిలో ఊయల లూగినోల్ల కథలింటే
ఊరు ఊరంత కన్నీరు ఏరయిపారుతది
నీ రాయిగుండై రబ్బరై కాలి
కుతకుత ఉడుకతది
మా పొలిమెరలకు రాండ్రి
మా అమరవీరులు త్యాగాలతో ఆహ్వానిస్తరు
కదలకనే జనాలకు కదిలిస్తరు
ఒక్కొక్కరిని ఉరిమె మెరుపు తీగలాగా ఉసికొల్పుతరు
విద్యార్థులా ! కాదు
మా తెలంగాణ వీర సైనికులు
చైతన్య పాఠాలు బోధిస్తూ
ఎద శిలాఫలకంపైన రక్తాక్షరాలు రాస్తుండ్రు
ఉద్యమాన్ని ఉధృతము జేస్తూ నిలుపుతండ్రు
బలిపీఠాల మీద వాలిపోతూ
రాలిన తారల కాంతితో
వేల ఇంద్రధనస్సు ద్వారాలై
ఉద్యమ పావురాలను ఎగురేస్తుండ్రు
కార్మిక ఉద్యోగ ఉపాధ్యాయులు
బాధ్యతతో బందవస్తు వస్తాదులై

సమ్మెతో సర్కార్ గల్లపట్టింద్రు
రాస్తారాకో, రైల్‌రోకో
ఏక నాదం మేకులయి యేకమయితంద్రు
ఏకాభిప్రాయాన్ని సీమాంధ్రుల్ని అడుగుతరా ?
బుద్ధి చెపుతూ గడ్డితినే బాపతులు
వాల్లకు పక్కా అయితే ఏకాభిప్రాయం
బే పక్కా అయితే దోఖాభిప్రాయం

22-07-2011

**-సిద్దెంకి యాదగిరి**



# తెగారం

నినదిస్తున్న నల్లకోటు న్యాయాన్ని
గల్లపట్టి కొడుతుంటే
నడిరోడ్డు తెల్లబోయింది
నెత్తురు అలుకు పూత చల్లినా
ఉసిగొలిపినోడు ఉట్టిదంటడు
కళలకు వలలేసి
తలలకు వెలకట్టి
గళాలకు గురివెట్టి
బతుకులకు గిరిగీసిండు
పాటను 16 ముక్కలుగా నరికి
తుపాకి గుండ్లతో తూట్లు పొడిచినోడు
పోలీసు రూపులు రాజ్యంరేఖలు
క్లింటన్ సేవలో మెంటల్ ఎక్కిన మాటలు విని
అధికారం దండల
తెలంగాణ పరిశ్రమల బొందల తోసి
ఆంధ్రా పరిశ్రమల బాగు కోసం
పరిపాలన బండకు "నార" చీరిన బాపతిగాడు
తల్కాయెల్ని ఆలోచించకుంట
ఆలోచించే తల్కాయెల్ని
ఎన్‌కౌంటర్ల పేరుతో సంపినోడాయే
నిజాలను నిలపెట్టి కాల్చినోడాయే
వకీల్ల నినాదాలు విని వొట్టి గెట్లూకుంటడు

రెండు ప్రాంతాలు రెండు కండ్లని
ప్రకటించే మిడిగుడ్లకు
మింగుడు పడందే తెలంగాణ
మింగకున్నా జారేది వెన్నుపోటు సమైక్యత
తడిగుడ్డతో గొంతు కోసెటోనికి
మోకాలుకు బోడి గుండుకు
దందెడ ముడి లెంక
తబలకు తాళం తలుపుకు గొల్లెం
'తా' అనకముందే తందాన పాడే
తెలివి తక్కువ తొత్తులు తెలుగు తమ్ములు
తెలంగాణ వాదాన్ని ఎత్తుకోక
అమరవీరుల ఆశయాలను హత్తుకొనక
రాజీనామా చేయ శాతకాని
రీతిలేని నేతలారా
పోంద్రహ పొంద్రి
సీమాంధ్ర ఉర్లకు తెర్లయి
చరిత్ర హీనులవ్వద్దు
ప్రజా తెలంగాణ మంటల్లో
తగలబడి పోవద్దు
దాడికి జవాబు ప్రతిదాడి
తెలంగాణకు అడ్డుపడెటోల్ల నడ్డిరువాలె
తెగారం తోటి తెలంగాణ తెచ్చుకోవాలె
నల్లకోటు నగారా చట్టబద్ధంగా మోగాలె

06-03-2010

**-సిద్దెంకి యాదగిరి**



# ప్రజలే ఉరితాళ్లు

ప్రజలే ఉరితాళ్ళు
అధికారం అవ్వకోసమే
అవ్వతోడు
అవ్వ తండ్లాట తీసేందుకే
ఒట్టులు పెట్టుకొని
కాలానికి ఒగరుకొడుతూ
తిట్లను గాలికొదిలి
గోడకేసిన సున్నమోలే అధికారానికి
అంటుకపోతన్నం
ఆ రంగం ఈ రంగం
పదవుల బహిరంగమంతా
తెలంగాణ అవ్వకోసమే
వెలేసి వెక్కిరిస్తూ కసిగా కసిరిచ్చుకున్నా
సిగ్గుతో చిన్నబుచ్చుకోలేదు
ఏమోతాదైనా ఫరవాలేదు
అవ్వ పరువుకోసమే తండ్లాట
మా కడుపులు నిండితే
అవ్వ ఆకలి తీరుతదన్నపుడు
అవ్వకు బువ్వెందుకు
మమ అంటే సాలు మమకారమెందుకు
సలికూడు తిని
గుడాలు నములుకుంట

ఉడుకు బువ్వ అయెదాక వుంటం
శాతనైన కాడ్కి అంతమేమే తింటం
రాజీనామా జేసినం
మల్ల మల్ల జేసేతందుకు మతిలేనోల్లమా ?
ఎపుడైన రాజీనామ జేస్తం
యిపుడు జేస్తమా రాజీనామా ?
మేం జేసిన రాజీనామా
పేద్ద రాజీ
నిజమైతే కద్దరు వన్నె చెరిగిపోదా ?
హుందాతనం అరిగిపోదా?
పొట్ట తిప్పలకు పాట్లూ పోట్లే
అవ్వవ్వ అంటె కడుపు నిండుతాది
పేరు చెప్పుకొని పెద్దయితిమి
మమ్ముల మా పదవుల
మా ఇటలవ్వ చూసుకుంటది
మా పెదవుల తీట పోను ఎందుకంటం
యెన్కా ముందూ రాష్ట్రం ఎట్లయినా వస్తది
మోచేయి పొంటి పదవుల నీళ్లు
మోకరిల్లి తాగినోల్లం
ఎదురు తిరిగి బతుకుతమా
రాక రాక వొచ్చినదాయే ఎట్లొదులుకుంటం
ఏదున్నా ఓట్లుప్పుడు సూసుకుందాం

– – –

మామకు వెన్నుపోటు పొడిసినోడు
మనకు హారితి యిస్తాడా
రాజకీయ కొలువులు యిచ్చి
బతుకుమన్నోడాయే
అధికారము యిచ్చినా అదుపులో పెట్టినోడాయే
మనది కొట్టి మనాదికి యింత పారేస్తే
మూసుకొని మూటగట్టుకొంటిమి
తెలంగాణ బతుకు ఏట్లె పోతేంది కాట్లెపోతేంది
తెలివిగ బతుక నేర్వాలే గని
తెలంగాణకు వ్యతిరేకమా ?
రెండు కండ్లు రెండు ప్రాంతాలు
ఒక్కటనే రెండేళ్ల ఆకారం అంటూ
చూపు యిటు
ఐనాసరే మన తెలంగాణ విముక్తి కోసం
బాబు యిష్టం తీరు బడాయి గొట్టాలే
ఆయన యిష్ట ప్రకారం కొట్లాడాలే
లేకుంటె బతుకు దెరువు ఎక్కడిది

\- - -

రాజీనామాకు భయపడే రోతనేతలారా
సకల జనుల సమ్మె మోగుతంది
ఊరూర ఏరు అయి పొంగితే
ఒక్కొక్కలు ఓట్ల కెరటాలై మునిగిపోతరు
తెలంగాణ ఉద్యమ లావాలు రాలిపోతున్నరు

వాల్లే పగబడితే మీ ఒగల రాజకీయం ఒడిసిపోతది
పగదారుని చంపే ఆచారం లేదిక్కడ
చంపి సచ్చే దమన నీతి రాకుంట చూడు
ఛీదంబరం
సమ్మె కొలిమి రగులుతుంది
ముద్దుగ సాగ దీస్తది
ఎటు గావాలంటే అటువొంచుతది
ఓట్ల తుపాకి రాముల్లకు
ఉన్న ద్రోహులకు
ప్రజలే ఉరితాళ్లయితరు

15-09-2011

-సిద్దెంకి యాదగిరి



# అవినీతి రహిత ఉషోదయానికి...

అధికారంల అసీనమైనంత కాలం
అందిన కాడ్కి ఆరగించుడే దంద
పదవికాలమంత పంతరాగలు
పక్షపాత తత్వమే పారదర్శకత
మాఫియా మార్గదర్శకత్వంలో
సామధాన బేధ దండోపాయాలు
ఉద్దరిస్తమని ఓట్లపుడు
స్వరం సవరించి దద్దరిల్లినోల్లు
అనురాగ గీతాలు ఆలపించినోళ్ళు
స్కాంల స్కీంల పేరిట
టెండర్ల రింగయి
అవినీతి యిరుసు మీద అధికారమై తిరుగుతరు
పురుటి నుంచి
వంచించే వ్యక్తిత్వాన్ని నిర్మించుకుని
దహనమో ఖననమో ఏదో ఒకటి పూర్తి అయ్యేవరకు
అన్నీ అవినీతి మయమై
నిత్యం వేధిస్తూ వెంటపడుతనే వుంటయ్

– –

నిందారోపణల వర్షం కురుస్తూ
కెరటమై ఎగసి పడుతుంటె
నిండా తడిసిన ముద్దాయిలా
నిలబెట్టాలని చూపుతూ

అన్నా అంకితత్వాన్నే ప్రశ్నిస్తది సర్కార్
బలుపులేని వాపు ప్రభుత్వం
బలం ఉందో లేదా అని ఊపుతూ
బలహీనమై భంగపడుతది
జనగర్జనల జడివానలో గజగజ వణుకుతది
తీరొక్క గజదొంగల స్థిరనివాసం
కరుడు గట్టిన తీవ్రవాదుల కారాగారం
తిహారు జైలు పొగరు నవ్వుతో బంధించాలని
జనచైతన్యపు జ్వాలా కిరణాలకు
ఒగరుకొట్టే దున్నపోతు అయింది
ప్రజాచైతన్యమ్ముందు గవురుమెంట్ గాడిద నడక నడిసింది
ప్రజకంటకులైన అవినీతి నేతలపై
సంఘటితమై తలపడాలి
అవినీతి రహిత ఉషోదయానికి
అందరూ నేను సైతం అనాలి

01-10-2011

**-సిద్దెంకి యాదగిరి**



# తెలంగాణ మార్చ్

మీకై పరితపిస్తున్న క్రమంలో
ఒంటరితనం చుట్టూ కటిక చీకటి కమ్ముకుంది
మెల్కొన్న రెటీనా పొరమీద మీదోస్తి
తెరమీది బొమ్మలా అంత: తెరమీద కుస్తీపడుతూ
జ్ఞాపకాలన్ని మేల్కొల్పుతూనే ఉన్నయి
ఆలోచిస్తున్న తెరచిన కళ్ళపై
నిద్రపొర అలుముకున్నపుడు
చిద్రమయిన బతుకుల్ని భద్రం చేయడానికి
ముళ్లు అయి గుచ్చుతున్న మీ ఆరాటాలు
కలల అలలతో దోస్తీ కడుతున్నాయి
భూమిని గుద్దుకునే నేలచూపులు
ముడివడి నడిచినకరస్పర్శ కోరస్ నినాదపు పిడికిట్లో
సాగిన అడుగులు మొరాయిస్తుంటే
పోటురాళ్లు పోరుకు దారి చూపుతూ
గుద్దీ బుద్ది చెపుతూనే ఉన్నయి
లక్ష్యం గిరిగీసుకున్న అక్షంపై
భ్రమణ పరిభ్రమణ ఊపిరి సెరన్‌లు
మీరు లేరనీ రారనీ
ఉద్యమ నిప్పుల తాపం నిలువెల్ల ఎగజల్లుతూ
సోయిసోపతి గావాలని పిలుస్తూనే ఉన్నయి
నల్లటి తారు రోడ్లను యుద్ధభూముల్ని చేసి
ఆశయం ఎర్రలుకు రక్తమై త్యాగ తివాచి పరిచారు

దూసుకొస్తున్న టియర్ గ్యాస్ గోళాల్ని
క్యాచీలు పట్టి తిప్పికొట్టారు
ఎముకల్ని లాటీలు చేసి రాజ్యంతో కోలాటమాడుతూ
నెత్తురు నీళ్ల సాకతో జడకొప్పులేసి
తలపెట్టిన కార్యం కోసం
కార్జాలు, దొబ్బలు పీక్కొని దోరణం కట్టారు
తలల్ని తాకట్టు పెట్టి ఉద్యమ శిఖర తల్వార్లు చేసింద్రు
నిరాయుధ పోరు కవాత్ చేస్తూ
దూసుకొస్తున్న తూటాల్ని దోసిట్లో బంధించి
గోలిమారు ఆడుతూ చౌరస్తాలో నిరసనలైతిరి
రాజ్యంపై రంకెలేస్తూ వడిసెల రువ్వడితో
నిజమైన యుద్ధమయ్యారు
నివురగప్పిన నిప్పుల్లోంచి నింగికెగసారు
ఆకాశంలో నెలవంకా ! ధృవతారా . . . . ! !
తొంగి చూస్తున్న మీకిపుడు పంచభూతాలే సాక్షి
సమైక్య భూతాల మెడలు వంచటానికి
విముక్తి సేవలో మీరనుకున్నది సాధించటానికి
ఇంటికో మనిషి చేతులో జండా
తెలంగాణ సంకెళ్లు తెంచడానికి నడుస్తున్నం
త్యాగాల తిలకం దిద్దుకొని
అమరవీరుల ఆశయాల్ని ఆలపిస్తూ
ఆశల ఖడ్గాన్ని ఆలోచనల కిరీటాన్ని ధరిస్తున్నం
తెలంగాణ మార్చ్ కై కదులుతున్నం

28-08-2012. (19-09-2012 చెలిమె, నమస్తే తెలంగాణ)



# లైఫ్‌లాంగ్ మార్చ్

తొలుచుకొని తొంగి చూస్తున్న కోడిపిల్ల
మనుగడ కోసం మూల్గుల రాగమెత్తి
ఆపదలో గమ్యాన్ని అందుకోవాలని
మనసుధారగా వలపోస్తుంటే . . . .
ఒంటిని వింటి నారిగా వొంచి
కొమురంభీం బాణాలమై రణానికెళుతున్నం
రెక్కలు తొడిగిన ఊసిల్లపుట్ట
వెలుతురుని వెంటాడుతూ
గగనమంతా పరుచుకోవటానికి
తెగిపడుతూ దారి తప్పినా
గురికోసం తలపోస్తుంటే. . . .
పొత్తును చెరపి పోరును గెలుచుటకు
ఊళ్లను వడిసెల రాళ్లను జేసి
మనసుల్ని మానుకోటలుగా మలుచుకుంటున్నం
క్రమశిక్షణ కవాత్‌క్రమం ముప్పేట దాడి
ఫిరంగులయి మోహరించిన గుంపు
బలసర్పం ఎముకలు తొలచిన బలియాగం
చీమల జైత్రయాత్రను జూసి
గుండెల్ని మండే గుత్పల్ని చేసుకొ
దోపిడీ సమైక్యం మీద దండెత్తడానికి
మార్చ్ దండు కదుతున్నం
ఒగ రాజ్యం పొగరు వొంచిన చరిత్ర కలిగి
ట్యాంక్ బండ్‌పై కూలిన రాతి విగ్రహాల సాక్షి
అంతు చూడటాన్కి గంతులేస్తున్నం

– – –

ఈగాలి
పరాక్రమమును పరిమళిస్తూ
పోరాటపటిమలకు ఊపిరిలూది
బ్రతుకడమంటే యుద్ధాలంటున్నయి
ఈ నేల
ఒరిగిన వీరుని ఆశయాల్ని
తడిసిన నెత్తురులో ఒడిసిపట్టుకొని
వీరత్వం సర్వుగంప పొలి చల్లుతుంది
తెగించి కొట్లాడాలని తెలంగాణ పోరుమంటుంది
సాయుధ రైతాంగ ఆయుధాల వారసత్వం
బందగీ న్యాయ పోరాట దీక్షలో
చాకలి ఐలమ్మ ధీరత్వం
దొడ్డి కొమురయ్య అలుకు చల్లిన అమరత్వం
ముఖ్దుం మోయినొద్దీన్ ఉద్దీపనలు
షోయాబుల్లాఖాన్ రక్తాక్షర ప్రతిస్పందనలు
369 మంది విద్యార్థి యువకుల కాల్చివేత కమురు వాసనలో
వెయ్యి మంది బలిదానాల ఆశయాల సాధనకై
జయశంకర్ సార్ ధ్వజస్తంభ ఆలోచనలతో
ఇంటికి ఒక్కరం పోరుజెండానెత్తి
అను నిత్యం లైఫ్ లాంగ్ తెలంగాణ మార్చే . . . . . .

25-09-2012

**-సిద్దెంకి యాదగిరి**



# ఎల్లగొడ్తం

మా నోట్ల బుక్కను మాగ్గాకుంట చేసి గగ్గోలు పెడుతూ
గలిబిలితో గాబర చేస్తుండ్రు
ఫ్రీజోన్ కుట్రను ఛేదిస్తే విభేదిస్తూ
మాట్లాడుదామని కొట్లాటకు దిగనిస్తలేదు
జాగోమాట జాజిరి తీవ్రత
పెయంత శీదర తాయిమాయి
గా గులగుల గోకెంతందుకు
మనగులాపోల్లను మలుపుకుంటండ్రు
తలుపు పెట్టి చెపుతూంటే కొలుపు పెట్టి వింటూ
తారంగమాడుతండ్రు
వాల్లకు గోకుతూ మనకు రాకుతున్నరు
పుకార్లు నమ్ముతున్న బెయిమాన్ బికారిగాల్లు
ఏసిన ఎంగిలి బొక్కను కంకుతూ
ఎర్రికుక్కలై మనమీదకే మొరుగుతండ్రు
మిడిగుడ్ల దొంగకు దడ
సమైక్యవాదం సంకల కనపడని వంకరబుద్ధి
ఓట్లాపతిల "జై" ఓట్ల తెల్లారి తూట్లుపొడిచి "నై"
కక్కిన కుక్క గతికినట్లు "జై""నై" కి జై కొట్టే సొట్టగాళ్లు
పదితీర్ల పైత్యం రంగు పసుపు వర్ణం
'నేనే పెద్ద పుడింగి'నని బిల్డప్
అంగిలాగులేని అందం తరీక మేధావి సదువు ప్రకాశం
అతి తెలివి నాదేనని యిచ్చంత్రం

అధికారం మూతులు నాకేనోరు
ఒ(్రుడు ఒకటే తీరు
అన్ని కలిపితే ఆవు మొకం గాడిద నడక
సద్ది బత్తెం మేమే తెస్తం
బుద్ధి ఉన్నప్పుడు అమ్మ బువ్వపెడ్తది
పెట్టిపొయ్యలేదని పేర్నాలపెడ్తమా ?
రాజకీయం యిడిసి పెంట పెరళ్లు తిరుగుతమా ?
వచ్చిరాని తంట మాకెందుకు
తెలంగాణ తుంటమాకెందుకు
మేం పదవిల యిమిడిపోవాలే
అధికారం చేతులమేం మా చేతుల అధికారం
తెలంగాణ జాగో జగావో లేదు
జానేవాలో జా.....వో..... ఆనేవాలో ఆవో....
హమ్ నై జాతే నై యాతే
దమ్ములేనోడు పొద్దంత పొయిరాళ్లు పొందిచ్చినట్లు
దొంగటీవిల 24 గంటల ఇచ్చంత్రపు వార్తలు
ఆంధ్రకు వడ్డింపు తెలంగాణకు బుకాయింపు
రజాకార్లను తన్ని తరిమిన ఒడిసెల రువ్వడి
చెప్పులు చేతపట్టుకొని పరుగెత్తిన కాసుకెరికే
మాజాగలకేలి మ(్రిసూడకుండ ఎల్లగొడ్తం
మాతో కలిసెటోల్ల కలుపుకొని

10-11-2009

-సిద్దెంకి యాదగిరి



# ఎందుకంటే మేంకవులం

మనసులో కత్తెర్లు దోపుకొని
హక్కుల్ని హరించే మధుర వాక్కులపై ఎదురుతిరుగుతం
ఎందరినైనా సరే వెంటాడుతం
ఎందుకంటే మేం కవులం
గుచ్చుకోవాలనుకుంటున్న ముండ్లతో మాట్లాడుతూ
తండ్లాటల తలపులయి విలపిస్తం
జీవన యాత్రలో అందమైన పూలకు వందనాలు చెల్లిస్తం
చీకట్లో తోవచూపుతున్న చుక్కలకు చేతులెత్తి మొక్కుతం
ప్రేయసీ ప్రియుళ్లు బండరాళ్లపై పేర్లు చెక్కుకున్నట్లు
గుండె గోడలపై చెరుగని గురుతులు చెక్కి
షరతుల్ని బేషరతుల్ని బేరీజువేస్తూ వెళ్తుంటం
దు:ఖాగ్ని దూరమయి ధూళిలో తేలిపోతూ
విషాదాలకు కారణాలు వివరిస్తం
రాలిపోతున్న కలలపై వాలి
రగిలే కోరికల్ని ఎగరేపుతం
ఎందుకంటే మేంకవులం!
ప్రపంచమంత సంబరాల్లో మునిగి వున్నపుడు
అంబరాన్ని తాకుతం
అక్కడి నుంచి దిగంబరంగా వున్న నేలను చూసి
కన్నీళ్ల కరచాలనంతో రైతుని కలుసుకొని
వర్షించుమని మేఘాన్ని వేడుకుంటం
బతుకు బడి తపోవనంలో పిల్లమునుల దగ్గరికి పోతం

అక్షరాయుధాల్ని బోధించి
ఆత్మగౌరవ బీజాక్షర మంత్రం ఉపదేశిస్తం
మేల్కొలిపే తలలకు మేకుల సంకెళ్లతో
నిర్భంధం విధిస్తున్న రాజ్యమ్మీదికి
అజ్ఞాత కవులమై తిరుగుబాటు పొగరాజేసి తిరుగుతం
ఒక కంట అగ్నిని మరోకంట అమృతాన్ని వెదజల్లుతూ
వస్తువినిమయ విషతల త్రాసును చూసి విరగ నవ్వుతూ
సమాధి అయిన మానవ సంబంధాలు చూసి మదనపడతం
సుందర ఉదయాన అందరు బాగుండాలని కోరుకుంటం
యావత్ విశ్వాన్ని మునివేళ్లతో ముద్రిస్తం
భూమ్యాకాశాలు గతించేవరకు కావ్యాలమై జీవిస్తం
నిద్దురలో పీడకలల కలవరింపుతో మేలుకొంటం
అర్ధరాత్రి దాటినా అక్షర కణాల్ని పిడికిట్లో బంధించి
భూమ్మీద వెదజల్లి వెళ్లిపోతం
ఎందుకంటే మేంకవులం!

10.10.2012, 12.00 రాత్రి కర్ణాటక తెలుగు
రచయితల సమాఖ్య వారు నిర్వహించిన దీపావళి కవితల
పోటీ2012లో కన్సోలేషన్ బహుమతి గెల్చుకుంది.

**-సిద్దెంకి యాదగిరి**



# మా కోసం వస్తున్నావా ... ?

మా కోసం వస్తున్నవా . . . ?
అయితే రా . . .
జై ఆంధ్ర పుత్రా . . . స్వాగతం
మీ తొమ్మిదేండ్ల పాలనలో
మేం తరించి తన్మయం చెందలేదా ఏం ?
ఆల్విన్, నిజాం షుగర్‌లను అడ్డికి పావుశేరు అమ్మితే
మా బతుకుల మీద కటిక చీకట్లు కమ్ముకోలేదా
తిరుగుబాటు నిరసనల అణచటానికి
డయ్యర్ పాలన ఆగష్టు 28
బషీర్‌బాగ్ చౌరస్తాను
తుపాకి గొట్టాల్లోంచి నెత్తురు చిమ్మి
చేదు మరక చరిత్రను అలికె
కలమెత్తిన కవితల మీద గురి
గళమెత్తే కంఠ స్వరాలకు ఉర్లు
పదహారు ముక్కలయిన పాట దేహం
భువనగిరి గంగ బాయిల్ల కలిసే
దూసుక వచ్చిన తూటాలు ఇంకా
వెన్నెముకల కెలుకనే వట్టే
సర్కార్ పారదర్శకతను నిందితుల జాడదొరకకుపాయే
దాతృత్వ పాలన మీది
అమెరికా అధ్యక్ష పూజలో
శాయ శక్తులోడ్డి బిచ్చగాల్లను లారీల్లో కుక్కితే
దిక్కులేనోల్లను తిన్‌దెర్లు చేసిన ఘనత

నీరు మీరు ప్రోగ్రాం మీది
నీరు మీరే మలుపుకుంటిరి
అధికారంల మీరే ఉద్యోగంల మీరే
కాంట్రాక్టర్‌లు మీరే
నీరులేని నారు మల్లలో
పునాస పంట పురుగు మందు హత్యల్తో
బతుకు కన్నీళ్ల బాధలు మాయి
జన్మభూమి సృష్టికర్తా . . . !
కదులుదాం రండి మనం జన్మభూమి కని
మా హైద్రాబాద్‌ని వదలక పోతివి
సీమాంధ్ర జన్మభూమికి కదిలి పోతూ
వస్తున్న మీ కోసమంటే మేమెట్లా నమ్మాలే ?
మీకోసం, మీ పార్టీ కోసం, మీ అధికారం కోసం మీరొస్తరు
మా కోసం ఎందుకొస్తరు సామీ !
శ్రమదానం రూపశిల్పి
అధికార కోసం ఆంక్షలు విధించుకున్నవు
పాలనా ముద్రికల కోసం పాకులాడుకుంట
'మీ కోసం వస్తున్న' అనే ముసుగుతో
నీ కోసం నీవు శ్రమదానం చేసుకుంటున్నవు
బాబ్లికి బస్సుయాత్ర
దిక్కులు చూసుకుంట
మరాఠి పోలీసులపై హైజంప్ చేసి
ఎగసోపుకుంట ఉరుకులు పెడితివి
హైప్ చేసి మీడియా హైజాక్ చేస్తివి
నీళ్ళు, నిధులు, కొలువుల మీది గిర్‌గ్లాని కమిటీని గిరాటేస్తివి

అమలు చేయిమని అడిగినపుడు
చూస్తం, చూస్తం, పరిశీలస్తమని హామీల వర్షం
మా పట్ల నీ ఆరాటం ఆరుపాల్లు ఆచరణ సొల్లు కబురాయే
వంకర్లు తిరిగిన ఫ్లోరోసిస్ బాధిత నల్లగొండ
సిల్కుం బట్టి పెచ్చులూడుతున్న ఇనుపబతుకు
నీ ఇకమాతుల్ని ఇద్దెల్ని చూసి సావు మొకంతో ఏలనగా యిగిలిస్తది
ఒకే ఒక్క కోరికతో ఒక శ్రీకాంత్ చారి కాలుతున్న రూపం
కమురు వాసన కక్కుకుంట ఏం చెప్పుతవని ఎదురైతది
ఆమరణ దీక్షా అసుపత్రి పరుపు
కొట్టుకాడిన బక్క పలుచటి జీవనం కోసం
ఒక్కటైన జనచైతన్య కంభం
డిసెంబర్ 9ని గుర్తు చేస్తది
వలసపోతున్న వల్లకాడు
పాలమూరు వలపోతకు ఆధారం చూపలేదనీ
వస్తున్న నిన్ను ఒకారంతో వద్దుపో అంటది
కాకతీయ తోరణమే రణమైతంది
బోధకుడు ఉద్యమ చోధకుడు
తరతరాల సారధి ఉద్యమాల వారధి
ఎత్తిన విద్యార్థి పిడికిట్లో
క్వశ్చన్ మార్కై ఆన్సర్లు అడుగుతది జయశంకర్ సార్ ఆత్మ
మా పట్ల వంకర బుద్ది ఎందుకనీ ?
69 ఆకాంక్షను పారగొరుతూ
కరువు కన్నీళ్ళను ఓట్ల కత్తులుగా దూస్తూ
బుద్దిమాసిన తనాన్ని వద్దంటది సిద్దిపేట
చితికిన బతుకుల్ని అతికే మెతుకు

మోసాలపై కుతకుత ఉడుకుతది
వడిసెల రాళ్ల వారసత్వం ఆదిలాబాద్
సుద్దాల హనుమంతు పాటలకు పురివిప్పిన కరీంనగర్ పోరాట ఖిల్లా
రంగులు మార్చేటోల్లను వెంటాడే రంగారెడ్డి జిల్లా
ఊల్లను ఉద్యమ స్థలాలుగా మలిచే ఉస్మానియా విద్య
తెలంగాణ గుండెకాయ హైద్రాబాద్
మీ కోసం వస్తున్న ముసుగును
నడిబజార్ మందిల ముసుగాపహరణం చేస్తయి

\- \- \-

మా కోసమే వస్తున్నవా...?
మమ లకు వెన్నుపోట్లు మాకు పన్నుపోట్లు
అన్ని పోట్లు పొడిచెటోనివి అని అనుమాన ముంది
అమరుల బలిదానాలు అడుగుకు ఒక తరీక అడుగుతున్నయి
ఒక్కటే కోరిక కోటి రకాలుగా కోరుతుంది
మా పోరాటం అనేక రూపాలుగా మారుతుంది
ప్రత్యేక రాష్ట్ర సాధనే నిత్యేక వచనమైంది
రెండు కండ్ల సిద్ధాంతం మార్చుకొని
మా కోసం, మా ఆకాంక్షల ఆకృతి కోసం రా . . .
గాయాల పాలైన ఓట్లు గమనిస్తయి
పాదయాత్ర కాదు కదా, ముని గాళ్ల యాత్ర
కౌనాకర్కి పండిపొర్లి అంగీలు చింపుకున్నా పరామర్శించడం కష్టం
నీ ఏలికల కల మసిపేలికల తీరుగ
వెలవెల బోయి వెలివేయ బడుతది నీ యిష్టం

మార్చి-2013 **-సిద్దెంకి యాదగిరి**



# మరుమన్న తల్లీ !

మా తెలుగు తల్లీ నీకు మల్లె పూదండ
మా తెలంగాణకు ముల్లుకట్టె దండె
కోస్తాంధ్ర యెమునిమూతి కాకులు
మా సీము నెత్తురు జుర్రి
తపుకు మాణిక్యాల్లో వోసి
కొవ్వొత్తులు జేసి
నీకు మంగళారతులు యిస్తుంద్రు తల్లి
గల గలా గోదారి కదిలిపోతూంటేను
ముంపుతో మా ఊర్లను ముంచుతుంటె
దారి కానని దారం తెగిన పతంగులై
వలసోసుకుంట వలస ఎల్లిపోతుంటే
మా మనసుల్ని కలి కలి జేసి
నీకు హారతి అర్పిస్తుంద్రు తల్లీ
బిర బిరా కృష్ణమ్మ పారుతుంటే
బీల్లైన భూముల్తో ఉరివడిన మెడలు
ఎండ్రీన్ చంపిన బతుకుల్ని
పాతర పెడుతున్న ఆంధ్ర పాలకులు
అరమంద్రం జేసి కాల్చుతుంటే
బంగారు పంటలు ఆంధ్రుల పండుతున్నె
తెలంగాణాలో
కడుపు మంటల చావులు
నీకు కనిపించవా తల్లీ!

వెయిస్తంబాల గుడి కళా వెలుగులు
ఉస్మాన్ కట్టడాల చిత్రాలు
అసెంబ్లీ నిర్మాణ చాతుర్యమంతా
పనికిరానిదై పాడువడ గొట్టి
తెలంగాణ తిండి తినుకుంటా
ఆంధ్రా పాట పాడుతరు
అమరావతీ నగర శిల్పాలే అపురూపమనీ
సంకలు గుద్దుకొని వొంకలొంకలు దిరుగుతున్నోల్ల జూసి
తృప్తి పడుతున్నావా తల్లీ !
బంగారు బొగ్గు గనులు తవ్వి
హైద్రాబాద్ జాగల్ని ఆంధ్రోల్లకు దారవోసి
గుడిసెల జాగడిగిన తెలంగాణ బీదలకు
ముదిగొండల గుండ్ల వర్షం కురిపిస్తుంటే
మురిపాల ముత్యాలు ఆంధ్రోల్లకు
కన్నీల్ల సత్యాలు తెలంగాణల నిలుస్తుంటే
నీ కండ్లు బైర్లు కమ్మినయా తల్లీ!
సోమన్న బసవ పురాణం సొయిదప్పి
కంచెర్ల గోపన్న పాటలు, పోతన్న భాగవతం
గుండ్రెడ్డిపల్లి సిద్ధప్ప దుర్కితౌటి భీమయ్య
నిత్యమై నిఖిలమై నిలుస్తే ఏంటి ?
నిలవకపోతే నీకేంటి ?
త్యాగయ్య గొంతులో తారాడిన నాదాలు
తిక్కయ్య తియ్యందనాలె నిలువాలె గని
తెలంగాణ కళారూపాలు కురూపాలా ?

నీకుళ్ళు భావన కనవడ్త లేదా తల్లీ
బల్మీటికి నిలిచిన రుద్రమ్మ భుజశక్తి
మద్రాసు నుంచి ఆంధ్రాను తప్పించినా
ఆంధ్రానుంచి తెలంగాణకు తప్పించలేక
తండ్లాడుతున్న తిప్పలు ముండ్లోలె కనవడుతున్నదా తల్లీ!
తెలంగాణ రైతాంగ సాయుధ పోరాటపటిమ
రజాకార్లను ఎదురించిన గుండెధైర్యం
హైద్రాబాద్ రాష్ట్ర ధనకీర్తి హీనమైతుంటే
మా చెవుల రింగుమని
మారుమోగుతున్న నీ పాటల్లో
మా బతుకు చరిత్ర జెంగు దింటున్నది
ఎల్సిన మా రంగును జూసి పొంగి పోతున్నావా తల్లీ
నీ చేతుల చెరుకు గడ సాక్షిగా
మా నిజాం చక్కెర ఫ్యాక్టరీని ఆంధ్రోల్లె అమ్మిరి
చిరునవ్వులు చిందించుకుంట ఆల్విన్ మూసిరి
నీ చేతుల కలశం ఆంధ్రాల వంచుతూ
మమ్ముల ముంచుతుంటే
మరుమన్న తల్లివైన నిన్ను కన్నతల్లిగా ఎట్లా జూస్తం ?
మా తెలంగాణ తల్లికి మేం సలాంజేత్తం
మరుమన్న తల్లికి మంగులం పెట్టి
మంగ ముండ్ల మంగళారతులు యిస్తం

సిద్దిపేట టైమ్స్ 10–నవంబర్–2010.

**–సిద్దెంకి యాదగిరి**



# మసకబారి

యూ టర్నింగ్ లేదు
టీ టర్నింగ్ లేదు
ఆల్‌రౌండ్ టర్నింగ్ అంతా సీమాంధ్రకే
భేదమే లేదు
పదమూడు జిల్లాలే తెలుగు జాతి
ఆత్మగౌరవం మనది
పొత్తు అనుభవించుట మన వారసత్వం
ఎన్ని చేసినా అన్నీ మనకొరకే
ఎవరినీ అడగకుండా దోచుకోవడం సమైక్యత విధి
అందినంత మేర అందుకోవడం మన బాధ్యత
మద్ధతు లేఖ పద్ధతి మార్చుకొని
అగ్గినవ్వు అలవరచుకొని
ఓట్ల పద్దు కోసం మార్పు ఒగరుకొడుతుంది
రంగులు మార్చే ఊసరవెల్లి
ఖంగుదిని కుమిలిపోతంది
ఉత్తర కుమారుని ప్రగల్భాలు
ఊహకందకుండా ఘడియకొకతీరు
అహంకార ఘంటా నాదమైతున్నయి
నారాకుమారుడు
ఊరూరికి నోరుదెరిచి
సమైఖ్య తాటిపండు
పొడుపుగా కక్కేవరకు చీకుతండు

ఒగ కన్నుతో తెలంగాణను ముంచుడు
మరో కన్నుతో సీమాంధ్రను పైకెత్తుడు
రెండు కళ్ళ సిద్ధాంతం చెప్పిన
తొమ్మిదేళ్ళ బహురూపుల పసిబాబు
ఒక్కోరూపంలో ఒక్కో హామి
వ్రాత పూర్వకమైన స్వార్థం
నిజమే
నరంలేని నాలుక
గొంతు మార్చిన స్వరమై బడాయిలకు పోతంది
తలలోని నాలుక
తలలేకుంట అయితంది
నోరూ మోరీ ఏకరీతిగా తేడాలేకుండా
మైక్ ముందు మంది ముందు
వయిక్ వయిక్ మంటుండు
వాదం పొత్తుపెట్టుకొని
ఓడిపోయేది గెలిచి
తెలంగాణ ప్రజల ఆత్మగౌరవానికి
ఒక్క మంత్రి పదవి యిద్దునుగదా
అంతా సమసిపోవునని
వివాదం లేపుతున్న కంతిరి మనిషి

మన పూర్వీకులకు అద్దం పుట్టిందా ?
మనది మనకు ఆయన ఇచ్చేదేంది
పుట్టుకతో వచ్చిన గుణమాయే వట్టిగెట్లపోతది
నిలువెల్ల కుళ్లు మచ్చలు గల చందురుడా
తీట కొలిక్కాయ చూర్ణం సమర్పిస్తున్నం
ఒల్లంత పూసుకో
రెండు నాల్కల అసలు గాత్రానికి
మండె కొర్రాయితో తలకొరివి పెడ్తున్నం
తెలంగాణ ఓట్లు అగ్ని గోళమవ్వకముందే
సీమాంధ్ర మబ్బుచాటు వెన్నెలా
మసకబారి దాగిపో...

10-030-2013

-సిద్దెంకి యాదగిరి



# తెగించే తెలంగాణ

తెలంగాణ బతుకు
అడివోలె తెల్లారుతుంది
అడివోలె పొద్దూకుతుంది
తిందామంటే తిండికి
కడుదామంటే బట్టకు
పొలం పారిద్దామనుకుంటే నీళ్ళకు
బాయికాడి సద్ది కుక్క తిన్నట్టు
ఖుద్దు తెలంగాణ బతుకు
కూడులేకుంటైంది
కరంటి యెలుగుల కయిత్కాలల్ల
బొగ్గుతవ్వి కరెంటు తయారు చేయవట్టిరి
తయారైన కరంటిని తలుగు తప్పదీసి తీసుకపోవట్టిరి
మోటర్లతోటి పారిచ్చే రైతు నోట్లె
యాటను మత్తకొలిపినట్లు
మాయ మాటలు చెప్పే నాయకుల మాటలకు మోసమైతిమి
మాయమాటలకు మంటపెట్టమా ?
ఆనకట్టలు కట్టి, ప్రాజెక్ట్‌లు నిర్మించి
చెరిసగం నీళ్లు పారిచ్చుకుందామని
మసిపూసి మారెడు కాయజేసి
వొందురు ఒట్టిమాటనా ....? అని
తలాపున పారుతున్న గంగనీళ్లను తరలిస్తుంటే
తలుచుకుందామా.. గెలుచుకోవద్దా ?

తీరొక్క రంగు - పేర్చినపువ్వు
బతుకు సప్పట్ల బతుకమ్మ పండుగ
ఎతలుఎండబోసినట్లు
మతిల అతికిపోయె పాట
ఉద్యమం కోసం ఉప్పుదిస్తుంటే
ఉట్టిగెట్లూకుంటం?
మా తెలంగాణల
సాపకిందినీరోలె సొచ్చి
మా నౌకర్లు మాకు గాకుండ జేత్తిరి
సంపాదన సంపద దోస్తిరి
మా నీళ్లు మాకు రాకుండజేస్తిరి
కొమురంభీంల వారసులం
దొడ్డి కొమురయ్య బిడ్డలం
సాకలి ఐలమ్మ కొడుకులం
మాదినెత్తురు పారించిన ఉద్యమాల చరిత్ర
మాకు అడ్డమొస్తే
మేంజేసేదే జేస్తం
ఐతే ఓట్లే లేకుంటే తూట్లే
సూడు!
నెత్తురు అంటిన అత్తరు చరిత్ర
నా తెలంగాణ పోరాట ప్రతీక

08-08-2008
సింగిడి సంచిక మార్చి 2010

-సిద్దెంకి యాదగిరి



# మమ్మల్ని మేం ఏలుకుంటం

చెడిపోయి తెగిన గాలిపటమైనోడు
తెర్లయిన బతుకుతోటి
మా పంచెన జేరాలని పాకులాడుతున్నపుడు
పిడ్కెడు పెట్టెతందుకు పిల్చి చేరదీసినం
తిన్నింటి వాసాలు లెక్కవెట్టె తంతరని
యికమతుగా మనమ్మనమ్మొక్కటని
నీదనీ, నాదనీ తేడా ఎందుకనీ
మైండ్‌సెట్‌కు సమైక్యాంధ్ర వైండింగ్ జేస్తుంటే
మంచితనమే మనదనుకున్నం
మనదంతా తెలుగు గణమని
భాష పేరు మీద బవురూపుల యేషం కట్టి
జోకర్‌గాని తరీక బొంకెచ్చి
తియ్యటి మాటల్తోటి బోర్లకొట్టించింద్రు
యిమానం పమానంలకు యిలువిచ్చేటోల్ల దాతువట్టి
కడుపుల కపటాలు దాసి నోట్లె కమ్మటి మాటలు
కాయిదాలకు ఒట్లు దినిపించి
కల్సుందామని కయిత్కాలాడి
పెట్టిన దస్కత్‌లు ఆరకముందే ఉట్టిది జేసి
యిమానం యిడిసి పమానం పాతర పెట్టిరి
తొక్కుడు బండకున్న ఓపికతోటి
ఒక్క దగ్గరున్నందుకు ఓర్సుకుంటుంటే
మా మంచితనం ఆసరతోటి నిలువూత ముంచుతుంద్రు

రామగుండం బొగ్గుబాయిల్ని పల్గజీరి
శమట దోసిల్లతో ఎత్తి
యెలుగుల కోసం యెగజల్లుతునే ఉన్నం
నీళ్లు నిలువెల్ల వారుతున్న మా జాగల
బాకీల బాదకు తటారిపోయిన చేన్ల
పాణం కక్క వోసిన ఎండ్రి డబ్బా
రుంగ జట్టుకబోయిన వరి ఉరితాళ్లై
కుటుంబ కుతికులన్నిటిని హత్య జేసినా
ఊకుంటే ఉసురే సాలనుకుంటున్నం
మా నోటికాడి బుక్కలైన కొలువుల్ని
పీతిరి గద్దలై తన్నుక వోతుంటే తెలంగాణోల్లమై తెల్లవోతన్నం
ఇంట్ల కటకట కొన ఎట్లతలేదనీ
బిందాసుగ యిడుపు కాయిదం జేసుకొని
ఎవల బతుకు వాళ్లు బతుకవొచ్చునని
చాచా చెప్పిన మాటల్ని యాది తెచ్చుకుంటున్నం
మా బతుకు మాగ్గావాలని
మా భాషను మా యాసను వెతుకుతూ
వీర తెలంగాణ కోసం పోరు జేత్తన్నం
మాది వేర్పాటువాద ఉద్యమమని వెకిలి చేష్టలు జేస్తూ
సమైక్యవాదంతో ఓండ్రపెడుతూ
అభివృద్ధి పేరు మీద తెలంగాణ భూములు అమ్ముతూ ఆగంజెయ్యవట్టిరి
మీతో పొత్తుకూడింది మాది తప్పేఅయింది
గుడ్డు దొంగతనం జేసిన్నాడు
గుంజికొట్టందే బేకారైంది

మా ముల్కిరూల్ల తల్కాయేదీసి
నౌకర్లు దోసుకునుడు సురువు జేసిన్నాడు
నడ్డిరుగ తన్ని ఒట్టి చేతుల పెట్టందే పాపమైంది
అటెండర్ల నుంచి అధికార్లదాకా అంతామీరై
610ని అమలుగాకుంట తొక్కి పట్టినపుడు
అధికారాన్ని కసరెల్ల తొక్కందే కష్టమైతుంది
పొత్తుకూడి ఎట్టాడినా
నౌకర్లు గుంజుకొని
నిధులు నీళ్లు మలుపుకుపోయినా
అన్నింటికి అన్ని దోసుకపోయినా ఊకున్నం
అన్నింట్లా మమ్మల్నే దోషులనగా నిలవెట్టి
హైద్రాబాద్ ప్రజనంటే ఎట్లూకుంటాం
పదవుల పంగనామాల కోసం
వొంగి వొంగి దండం పెడ్తూ
ముఖ్యమంత్రి మూతులు నాక్కుంట
అధికారం సంకల జొచ్చి తెలంగాణ తెర్లుజేసే మావాల్లకు
కోదండమేసి యుంత పొగవెడ్తిరి
రోకలి బండలతో కొళ్లగుజేసి పిడికెల తంపిల కాల్చిన కొంకలతో
కమురువాసన రాంగా తెలంగాణ సురుకు వెడ్తం
మీ తాత ముత్తాతల సంతటిల కల్తి లేకుంట వుడ్తే
వాళ్ల మాయిముంతల తావు కాడ్కి పొంద్రి
పొమ్మని పొక్కల తావురమైన పామోలె మలుసుకపంటే
పొగవెట్టి యెల్లగొడ్తం
పొగరుతోడి బుసగొడ్తే శిలకొయ్యతోడి ఎల్లపొడుస్తం

తెలంగాణ సాధనలో
గురిచూసి కొట్టె వొడిసెల వోలె రువ్వడి అవుతం
369 మంది అమరుల సాక్షిగా...
3కోట్ల తుపాకులమై తెలంగాణ సాధిస్తం
వద్దని అడ్డుపడెటోన్ని తెగ్గొడ్తం
తెలంగాణా గుంజుకొని
మాది మేం ఏలుకుంటం
ఖబడ్దార్ వలసవాది ఖబడ్దార్

–జాగో జగావో సంకలనం

**–సిద్దెంకి యాదగిరి**



# ఆయుధం

అనుబంధాలను ఆరగిస్తూ స్వార్థం
అరాచకాలకు తెగబడుతున్న అహం
మనిషితనాన్ని మాయం చేస్తున్న సంబంధాల మధ్య
వీగిపోతూ విరిగిపడుతున్న విలువల కొండచరియల్లో
సంక్లిష్ట శిథిలావస్థ స్థితిలోకి విసిరివేయబడ్డ బాధితులం
మనమిపుడు  ఒక యాంత్రిక మనుషులం
అవసరమనిపించినపుడు మొఖం వికసిస్తది
కుటిల కరస్పర్శ కౌగిలింతలో అక్కర నవ్వుల ప్రవాహాలు
దండాలుపెట్టే దొంగ వినయాలు
నటించుటే జీవితం
స్థార్థం వినయేన ప్లాస్టికు పువ్వులా శోభితే
మనిషికి ప్రతీకళ ఒక అప్టిట్యూడ్ కావాలి
బ్రతకడమూ బ్రతికించడమూ కళ
$360^0$ కోణంలో జీవితాన్ని మలచి
సాటిమనుషుల్ని సర్వనాశనం చేసైనా సరే
మనిషి పరిణామ సిద్ధాంతం పరివ్యాప్తి చేస్తూ
అణువులో పరమాణువు అయి పోటీలో గెలువాలి.
బాజా రాజకీయం ఎపుడూ తాజా స్కాంలై నవనవలాడుతూ
నమ్మిన సిద్ధాంతం కోసం ఒక దేశాన్నైనా అమ్మాలి
కార్పోరేటు కమీషన్లు రాజకీయ విధి నిర్వహణ
రాలిపోతున్న దేహాలతో మనకేంటి ?
వేయిమంది చచ్చినా పుట్టని శాసనం

వేళ్లు కదిపినంత సుతారంగా పుత్రుని కోసం పుట్టాలిమరి ?
మంది కడుపుకోత మనకు అక్కరలేదు
మన కడుపుమేత కోసం ఆలోచించాలి కదా
ప్రజలచేత ఎన్నుకున్న ప్రభుత్వం
ఏదిచేసినా ప్రజాస్వామ్యమే
మనకు పాలన ముఖ్యం
పాలితులు అంతకన్నా ముఖ్యం
ఆకాంక్ష కోసం అమరుల ఆశయాల్ని జోడించి
పాత పథకాలకు కొత్తరంగులు వేయండీ
యుద్ధరీతితో కాదు ఎన్నికల బుద్ధినీతితో.....
ప్రియ ఓటరూ
ఎన్నిక నీచేత
ఎన్నిక నీద్వారా
ఎన్నిక నీ కొరకు
ఆలోచన గురితప్పని ఆయుధం
ఆచరణ ప్రగతినుదుటి రాత

05. 05. 2013.

**-సిద్దెంకి యాదగిరి**



# శరీరాస్త్రం

నివాళ్ళు అర్పిస్తున్న చెమ్మగిల్లిన కళ్లు
నిలువెల్ల కొవ్వొత్తులై కరిగిపోవద్దు
నిరసన ర్యాలీలు ప్రతిగుండెలో లావాలై ఎగజిమ్మి
మొద్దు నిద్ర మొకంపై ముద్దెర్లు గుద్దాలి
ధర్నాలు ధైర్యాల ఔషధమై
సురక్షిత చుట్టు కంచె అభయం కావాలి
మొగితొడిగ్గనట్లు బతుకు తొడుక్కొని
ముళ్లకిరీటంలో మోస్తున్న అవమానంకు
వస్త్రాల్ని ధరించినట్లే అస్త్రాల్ని ధరింపజేయాలి
మగమృగవాసన అంతరాన్ని గమనించి
ఒళ్లంతా నిఘ్రాన్‌ల పడగలెత్తి
ప్రమాద ఘంటికల్ని పసిగట్టి ప్రళయ గర్జన చేయాలి
ఎగతట్టే కన్నీళ్లే కసిగా కత్తుల్నెత్తి
నిందలపై నిప్పులా కదంతొక్కి నిప్పు
రేడియేషన్ రెటీనా పొరలను అమర్చుకుంటూ
కఠినచికిత్స కనుచూపుమేర ప్రసరించాలి
విషాద వీచికపై విలువల విపంచి పలికించేందుకు
జీవించే గొంతుకలు నిజాల్ని నినదించాలి
మనిషిని మనిషిగా గాకుండా
మనిషిని ఆయుధంగా తీర్చుటే మనుగడ
దేహాన్నిలోహంగాను
అలోచనలని శరీరాస్త్రాల అమ్ముల పొదిలా అలంకరిద్దాం
సంకటాలకు దూరంగా కంటికి రెప్పలా
నవతరాన్ని అందించే రేపటి తల్లుల్ని కాపాడుకుందాం!

16.05.2013. రాత్రి 8గం॥లకు



# " హైద్రాబాద్ మాది"

బతుకు దెరువు వెతుకు లాటలో
పరువు నిలిపే భరోస నగరం
నకనకలాడుతున్న ఆకలి అస్థిపంజరాలకు
చావనివ్వని చౌరస్తా సాయం
ఫుట్‌ఫాత్‌ల మీద ప్లాస్టిక్ కవర్ల గుడిసెలు
భరించరాని చలి పేదవాని రెండు పిడికిల్లంతా
హైమాస్క్ లైట్‌ల కింద రకరకాల ఆసనాలేయిస్తది
రంగు రంగుల ఇంట్ల కావల్సిన కాలాలు
పైసల ఖర్చుతో వశమవుతుంటాయి
ఉన్నోన్ని లేనోన్ని అందరినీ ఆదరించే
నిత్య ధరణి ముత్తైదువా మా హైద్రాబాద్
రకరకాల మనుషులు చేరినపుడు
రాకాసి మనుసులు రాటుదేలాయి
బతికి ఉన్న తల్లికి చితిపేర్చే మర్మన్న కొడుకులు
సీమాంధ్ర ద్రోహులూ
హైద్రబాద్ మాదనే బుకాయింపు
సమైక్య బలుపు మాట
హైద్రాబాద్ మా బతుకు
హైద్రాబాద్ మా జీవితం, జీవనం
ఇది మా జన్మ హక్కు
మీ బతుకంతా తెలుసుకున్నా వొడువని చరిత్ర
మా భాగ్యం భాగ్యనగరం

ఇరాని చాయి రుచిలో ఇంపైన దోస్తు వాసనలు
బిర్యాని గుబాళింపుల ఆరగింపు సంతృప్తి సంపద
పోతరాజు శివసత్తుల దరువులు
మహాంకాళి బోనాల మహిమల రంగం
త్యాగపు తలంపుల పీరీల పండుగ
ఖవ్వాలి గుంపు స్వరాల భక్తి కవాత్‌లు
దర్గా చద్దర్లు, నమాజ్‌లు, రోజాలు
గణేశుల ఊరేగింపుల ఘనత
చర్చి గంటల కరుణామయుని అమృతధారలు
అనేక రకాల భక్తి మార్గం ఒకవైపు
నాస్తిక హేతువాదం మరోవైపు
జనసందడి వైరుధ్యంలో
అనుబంధాల అల్లిక నా హైద్రాబాద్
అసెంబ్లీ, ఆర్ట్స్ కాలేజ్, చార్మినార్ కళాకౌశలం
భారతదేశం భల్లున కళ్ళు దెరువకముందే
ప్రపంచ దేశాలకు దేదీప్యమానం
ఓపికకు తొక్కుడు బండ
అణుచివేతకు పోరు గుదిబండ
సిపాయిల తిరుగుబాటుకు స్పందనగా ఉరితీత
నినాదమై జీవించే ఓ తురుంఖాన్
పోరుబాటుకు నిలువెత్తు విలువ సాక్ష్యం
నియంతను ఎదురించిన ముఖ్దుం
రక్తధారల సిరానింపి ముక్తికై
ప్రాణాలొదుల్తూ

కాళకూట విషం కత్తి మొనమీద
కలం నిలిపిన యోధుడు షోయాబుల్లాఖాన్
వీరుల వారసత్వమే పోరాట పటిమ
అమరుల ఆశయ సాధనే తెలంగాణ
అణువణువు తడిమి చూడు
మాతాత ముత్తాతల వెట్టిపరిమళం
పురాతన శ్రమ పరిశ్రమ సోయగం కనిపిస్తది
అనుమానమా ? గోయితవ్వు
మా మాయి ముంతలు మాట్లాడుతయి
శోధించు హైద్రాబాద్ అంతా బోధిస్తది
పుండాకోరు పురుషుల్లారా
మీ తలపండు పలుగ
హైద్రాబాద్ మాది
అట్లెట్లా ? అని ఆలోచిస్తుండ్రా .... ?
మీ పేచీలు గోచీలు జాగర్త.
జిత్తుల మారి ఎత్తులేయక మాతో జీవించండి

30-08-2013

**-సిద్దెంకి యాదగిరి**



# మరణం ఆరంభం

మరణం ఏం చేస్తది ?
మరణం మనిషి గమ్యం కాదు
ఒత్తిడి తిరుగుబాటు చేయకుంటే
అనుక్షణం హింసిస్తది
మెదడును నెమరేస్తూ ఎముకల్ని కొరుకుతూ
పచ్చి నెత్తురయి ప్రాణాన్ని జుర్రుకుంటూ
పిరికి వాళ్లను హత్య చేస్తూనే ఉంటది
రివ్వున ఎగిరే గువ్వల ప్రేమను
కాదని కబళిస్తున్నపుడు
చూపు నిలిచిన కళ్ళను కనికరించి
ఇద్దరినీ ముద్దుగా అద్దుకుంటది
ఉద్యమ ఉధృతి ఆరిపోతున్నపుడు
మంటలో మాడిపోయిన నల్లటి దేహం
మేలు కొలుపు మంటల్ని రగిలించి
అణచే వెతల్ని అనేక కోణాల్లో చుట్టు ముట్టి
పోరుమంటను రాజేస్తది
ద్వేషం నింపుకొని, రోషం పెంచుకొని
సంకెళ్ళు తెంచటానికి ఉరికొయ్యకు వేలాడుతూ
బానిసవిముక్తిని దేశభక్తిని
మనసు పొరలపై గురినిలుపుతది
సహజ వనరుల సామ్రాజ్య వాద దోపిడి
కాలుదువ్వి కాలర్ ఎగరేసే క్వశ్చన్ మార్క్‌ను

బహిరంగంగా హత్యజేసి
ప్రసారం చేస్తూ పైశాచికానందం పొందే డాలర్‌ను
'ప్రశ్న' ఎపుడూ కొంగవాలు కత్తియై నీడలా వెంటాడుతది
నిరాయుధ తలలపై సాయుధ దాడి
కలల్ని అంతం చేసే కత్తుల కళ
యుద్ధాయుధమై నెత్తురుతాగే తల్వారుతండ్లాట
రువ్వడిగా దూరి ప్రాణమింగే తూటా
రోగవ్యాధుల వ్యాప్తి నశింప
అసహజ బతుకువ్రణం
పంత పగిలే చోటుకి పాదాల్ని నడిపించే మృత్యువు
బహురూపులుగా బాహువులు చాచి
ఒక్కరినీ వదలకుండా అందరినీ ఆహ్వానిస్తది
యిపుడు అన్ని మతాల సారమొక్కటే
ఆత్మను చంపే ఆయుధమేలేదు
ఆశల ఆశయాలను కాలరాసిన
కాలమెక్కడా చరిత్రలో కనిపించదు
జీవిత లక్ష్యాలకు అడ్డుపడిన సాక్ష్యమెక్కడా అగుపించదు
జనసహిత సుగుణాలెపుడు ఖననం కావు
అయినపుడు మనల్ని మరణం ఏం చేస్తది ?

సాహిత్య ప్రస్థానం ఏప్రిల్ సంచిక, 2013.

**-సిద్దెంకి యాదగిరి**



# ఇంకా అనాదలమే

నెలలు నెలలుగా ఎదుగుతున్నపుడు
కమ్మని కలలెన్ని కన్నారో తెలియదు
అమ్మ నాన్నలు ఆప్యాయతల గోరుముద్దల్ని
వెన్నెల రాత్రుల్లో వెచ్చని ఉగ్గు బువ్వ తినిపించాలనుకున్నారో తెలియదు
వాళ్ళు పెంచుకున్న ఆశల జాడ మాకు తెలియదు
రక్త మాంస ముద్దల్ని పంచి ఇచ్చిన తల్లి
పెంచి పెద్ద జేయాలనుకున్న తండ్రి
వాళ్ళ గుర్తులుగా మమ్మల్ని వదిలి
సూటి పోటి మాటల సుడిగుండంలోకి తోసి
అందరూ లేని అగాధంలోకి నెట్టి
అందనంత దూరం వెళ్ళి పోయారు
మా చుట్టూ బంధు మిత్రులున్నా
ఒంటరి వాళ్ళలా అనాదలమనే ముద్ర చెరిగిపోలేక
చాటుకో నేటుకో బాధల బరిసెలై పొడుస్తున్నయి
గతంతో మనసు గాయాలు చేస్తున్న మనుషుల్ని చూసి
ఆదరించిన సానుభూతి మాకు పెళ్ళి చేసింది
కష్టమో సుఖమో కలిసి బ్రతికినం
కలిగినంతల తృప్తి పడుతూనే ఉన్నం
దగ్గరైనా దూరమైనా ఆప్యాయతల్ని పంచుకున్నది
ఆత్మీయతలని పెంచుకున్నది మేమే
కష్ట సుఖాల్లో ఇద్దరం చెరి సగమై
ప్రేమే పలకరించి మమ్మల్ని అల్లుకున్నపుడు

అనురాగములు మొలకెత్తినపుడు
మేము నలుగురికి జన్మనిచ్చాము
తాతమ్మలమయ్యామనే తృప్తిలో మాకు పిల్లలే కాదు
వాళ్ళ పిల్లలున్నారనే భరోసా కలిగినా
మమ్మల్ని వెంటాడేది చెదిరిపోని గుర్తులే
బాధలనుభవించే పిల్లలు కనబడితే
మాలాంటి బాధలు వాళ్ళని వెంటాడతాయా?
ఓర్చుకుంటారా?
కన్నీటి చుక్కలుగా రాలిపడుతూ
మనసు ఎన్నో ప్రశ్నల చెరువైతది
కోపమొచ్చినా, కొట్లాడినా, బాధల్ని పంచుకున్నా
ప్రస్తుతానికి
ఎప్పటికి కూడా...
నాకు ఆమె, ఆమెకు నేను

17-2-2008
(నా జీవన సహచరి పుణ్య కోరికపై వాళ్ళ దంపతుల గురించి)

**-సిద్దెంకి యాదగిరి**



# నెత్తుటి కౌగిలింత

కములుతున్న గాయాలు
రాలిన ఆకుల కుప్పల్లో రాటుదేలుతుంటాయి
వేటాడి గుటుక వేస్తున్న బల్లిలా
చెట్టుమీది కాకుల గుంపు
గిరిపుత్రుల్ని చెరుపాలని
గురిపెట్టి గూడాలమీద దాడి చేస్తుంది
వంకలు వంకలు దిరిగి
వొడుపుగా పరిగెత్తిన వేటబతుకు
వెంటాడుతున్న ఇనుపగెక్కల ముందు
బతుక్కోసం బరివాత ఉరుకులు పెడుతంది
రాత్రిపగలు స్వేచ్ఛతో రాజిల్లిన అడవి
ఆకురాలిన చెట్లతీరున
అణవణువు భయం భయంతో
రాజ్య విస్ఫోటన కుతంత్రమ్ముందు
అస్త్ర సన్యాసిలా నిల్చుంది
దాడిని పసిగట్టిన శక్తి
ప్రత్యక్ష దాడిని ఎదుర్కోలేక
వీలునుబట్టి సుడిగాలి వీచినట్లు పరాయికరణ
అనునిత్యం సలుపుతున్న రాచపుండు ప్రపంచీకరణ
విరిగిపడుతున్న చెట్లలా విలవిల్లాడుతుంది
ఎపుడూ అప్రమత్తమయ్యే నిరంతర తెగువ
మధువులొలికిస్తూ మంటల్ని రేపే శిథిలాల పునర్నిర్మాణ పుస్తకం

ఆపాదమస్తకం తేనెటీగల తెగింపు కిరీటంధరించుకున్నం
అలజడి నేర్పిన తిరుగుబాటు ఆయుధం
పదునెక్కిన ఎదురుదాడి ఏదు
చెదిరిపోని బోధజేస్తుంది
స్వీయరక్షణకై ఎత్తినపడగ
విజయాన్నో వీరస్వర్గాన్నో ఎంచుకొని
ప్రాణమున్నంతవరకు పోరుమంటున్నది
చీమలదండు ఐక్యతకు కట్టుబడి కవాతులో
అడవిపాఠాల్ని అధ్యయనం చేస్తున్నం
వడిసెల రాయి గురిపెట్టిన బాణం
బిగుసుకునే ఉరులు తరానికోతీరు
మాతాత ముత్తాతల నాగరికత
ఈ అడవి మా బతుకు
అబూజ్‌మఢ్ పేరుతో అనుబంధాల్ని కొల్లగొడుతుంటే
మా నెత్తుటి వర్షంతో అడవిని హత్తుకుంటాం

ఉదయం 4 గం॥లో, 17-05-2013

**-సిద్దెంకి యాదగిరి**



# వినువారు కావలెను

తగవులాడుకొనిన చర్చలో తెగదాకలాగి
చివరకు మనం తేల్చిందేమిటి?
వాదులాట వాడితనం వాడిపోయి
జ్ఞాన ముడి విప్పలేక విలవిల్లాడుతూనేవుంది
గాయాలను పునుకుతూ గాబరపడుతావు
సానుభూతితో సాగదీస్తావు
నోరుతో మాట్లాడుతూనే నొసటితో ఎక్కిరిస్తావు
పాపాలు చేసిన గాయాల శిక్షలని
మనసు పుండుపై మాటల కారంచల్లి
బోధిస్తూ బాధిస్తావూ?
చెప్పేది వినవు వినేది చెప్పవు?
తప్పో ఒప్పో విన్న తరువాతే కదా తశ్ప
వివరణను వినకుండా తప్పుతో పోల్చి
చెప్పేది చెడగొడతావు!
నునుపుగానవ్వి కరుకుమాటల కత్తులు దింపి
కన్నీళ్ల ముంపుకు కారణమవుతావు!
అడ్డగోలు మాటలతో అడ్డుపడుతూ
గెలిచితీరాలని గేలిచేస్తావు గోల చేస్తావు!
ఎదురు ప్రశ్నలు సంధించినపుడు
బుకాయింపు మాటలతో బుజ్జగిస్తావు!
జరిగింది చెప్పుమని అడిగిందే అడుగుతావు!
ముందే సందేహిస్తూ చెప్పింది జరిగిందా అని సంధిగ్ధం!

నిజాన్ని అబద్ధం అబద్ధాన్ని అక్షరబద్ధం చేసే
స్వార్థ పరత్వమై నీవలె అందరనుకుంటావు
నిన్ను నీవు నమ్మనోనివి ఎవరిమీద నమ్మకముంటది ?
అనేక కోణాల అణచివేతల వెతను
భిన్న కోణాల దోపిడీ దృక్పథాన్ని
సామ్రాజ్య వాద విష విస్తరణను
ఎదుర్కొంటున్న చైతన్యపు నినాదాల్ని
చట్టబద్ధంగా హత్యలు చేస్తున్న రాజ్యాన్ని
వ్యక్తీకరిస్తే ధిక్కరిస్తావెందుకు ?
మనిషే మహోన్నతుడనే నీవు
ఆడపిల్లల భయకంపిత దాడుల ఉన్మాదాన్ని
ఎప్పటికపుడు కొత్తదవుతున్న వివక్షను
వేటాడి కుత్తుకల్ని తెగ్గోస్తున్న కులగజ్జి
పచ్చి నెత్తురు జుర్రుకుంటున్న మతపిచ్చి జూదం
గోడు వినవెందుకు?
మానవత్వం సంచరించే ప్రజాస్వామ్య చౌరస్తాలో
మనతో పాటు అందరినీ చర్చలకు ఆహ్వానిద్దాం
ఎన్నైనా చెప్పు! ఎంతైనా చెప్పు! ఎవరైనా సరే
దేనికైనా రా "ఢీ"!
వింటాను వివరిస్తాను!
నాకుమాత్రం వినువారుకావలెను!

19.11.2012. ఆంధ్రభూమిలో (సోమవారం) ప్రచురితం

**-సిద్దెంకి యాదగిరి**



# కాంతిమొలక

పాఠశాల పూలవనంలో నేను ఒక వనమాలినై
బాల్య మొక్కల పెంపకానికై
జ్ఞానసెలయేరునై ప్రవహిస్తుటాను
మొరటు గంజాయి మొక్క అల్లరి విద్యార్థి
నేను చిరునవ్వు ప్రేమ చూపుల్ని విసిరితే
వాడు తలదించినట్లే దించి అలజడి చూపుల్ని
నాపై ఎక్కుపెడుతాడు
ఏమి రాయని నల్లబల్ల కదా
సుద్ధముక్కతో మెదడు బల్లపై రాసి
బుద్ధికి తేవాలనుకుంటాను
ఆప్యాయతల్ని ఎగజల్లి
ఆత్మీయతను ఏరుకోవటానికి
నను నేను మరచిపోయి వాడిలోకి మారిపోతాను
వింతగా అరవటం,సోమరితనం మరువాలనీ
అహం కంటే ఆలోచన
పాఠం బ్రతుకు పాఠం ముఖ్యమనీ
విద్యా వినయం వివేచన గోప్పవనీ వివరింపాను
ఆరాధనగా కవ్వించాలను
ఓరి చిన్నారి నవభవిత నీదేనని చెప్తూ నమ్మించాను
విలువలతో వికసించాలనీ
బతుకునాడి వాడి అతని నుదుటిపై అతికించాను
అనుభూతితో ఆశ్చర్య చకితుడయ్యాడు

నిజాల్ని నిలువెల్ల తడిమి చూసుకున్నాడు
సాధ్యాసాధ్య సందేహంలో
ఉక్కిరి బిక్కిరయ్యాడు
మరల హితోపదేశంతో  పూరించాను
"నిడలా వెంటాడే నిరాశల్ని
గమ్యం గిరిగీసుకొని గురిచూసినపుడే
లక్ష్యం సఫలమైతది
సడలని సంకల్పం గెలిచేసాక్ష్యమైతది
వాడు శిధిల సందిగ్ధత నుంచి శిరసెత్తి
కర్తవ్యాన్ని కౌగిలించుకున్నట్లు
ముసి ముసిగా నవ్వాడు
వాడి మొఖంలో
ఏదో సాధించిన కాంతి మొలిచింది
నాలో శాంతీ నిలిచింది.

మార్చ్2014 సాహిత్య ప్రస్థానం

**-సిద్దెంకి యాదగిరి**



# జీవాక్షర వలలు

మనుషుల్ని
మనిషితనాన్ని మరిచి
అల్లర్లని విసురుతూ హింసని ప్రసవించే వాళ్ల యొద్దకెల్లి
అహింస శాంతి సాధన కొసం
నేను అక్షరాల అలుకు బోనం ఎత్తుకున్న
చరిత్ర చెత్తకుప్పల్లో కూరుకుపోయిన
నిర్లజ్జ బతుకు భావ చిత్రాలనీ
ఎదురించి నిలిచిన లావాల్నీ
కలంతో చిలికి సజీవ కళగా ఆవిష్కరిస్తున్న
ఆకలియానంలో ఆశల ప్రపంచం శూన్యం
నిరాశల్నీ చిమ్మే నమ్మకద్రోహం
నిలువున ముంచుతున్న అహమ్మీద
ధిక్కరించిన చరిత్ర ముఖాన్ని
ప్రక్రియా సాయం లేకుండా ప్రవచిస్తున్న
భయబాధల ఒత్తిడి మత్తడి
రాలిపడాలనుకుంటున్న రందికి
వీర రస చూర్నంలో ధైర్యం కలిపి
ఆత్మస్థైర్యం ఆయుధమనీ
ఎదురీత సాయుధమనీ
జీవించటమే తీర్మానం గావాలనీ
జీవాక్షర దరువు ఏస్తున్న
మనిషిని వస్తువుగా మలచి

వలపన్నే వ్యాపార సంస్కృతి
వలస పైత్తనం వర్ధిల్లుతున్నపుడు
అణగదొక్కె రాజ్యమైనా, అగ్రరాజ్య అధ్యక్షుడైన
ఎదురింపు నిరసనను ఎత్తుకొని
అనవసరమనుకున్నప్పుడు అజ్ఞాత వ్యక్తిగా
అక్షర నినాదపు శక్తిని అందిస్తా
మానవత్వం విరాజిల్లాలనీ
సమానతలు నిలువాలనీ
ప్రేమ సోదర భావం పెరుగాలనీ
తగిలిన గాయాల్లోంచి తవ్వితీస్తున్న సాహిత్యం
విశ్వ మానవ పతాకం పైన
నా అక్షరాల లక్ష్యం
వివక్ష రహిత ప్రజపక్షం
నా అక్షరాల గురి అపరిమిత పరిధి
నా అక్షరాలు జీవాక్షర చైతన్య వలలు

10-12-2013

**-సిద్దెంకి యాదగిరి**



# ఒక నిమిషం ఆగు

మెరిసేదంత బంగారమనీ
ఆచరణ రహితంగా బోధిస్తున్నావా?
ఆకర్షణ వలలో చిక్కి
మేను మెరుపు తేగలవెంట
సొల్లు కుక్కలా పరిగెడుతున్నావా?
ఒక నిమిషం ఆగు
వివేకం లేని సుందర స్త్రీ
పంది ముక్కున బంగారు కమ్మ
సిగ్గుతెచ్చుకున్నవాడు ఎముకలకు కుళ్ళు
పరస్త్రీ పాపపు గుంట
పరపురుషుడు మోసపుగొయ్యి
నియంత్రించే హక్కు సమర్పించి
అక్రమంలో నిండా మునిగి నీళ్ళు నములుతున్నావా?
ఆలోచించు
పాపము రాబడి మరణం
ఏదో సాధించాలనీ
మరేదో చెదించాలనీ
ఆచరణ రహితంగా బోధిస్తున్నావా?
ముందు మచ్చట్ల కుచ్చిళ్ళు
వెనుక ఎక్కిరంతల ధిక్కార స్వరాలు
రకరకాల బాధిస్తూ
పెత్తనం చలాయించే సత్తా
సదా సాధించాలనుకుంటున్నావా?

పూర్వ చరాత్ర పుటల్లో శోధించు
ఘనతకు ముందు వినయం
నాశనానికి ముందు గర్వం
నిలువు చూసి నిందలునిందలు
విలువ చూసి విషం చిమ్ముతూ
కరుకు మాటలనీ పేల్చుతున్నారన్నీ
యుద్ధ జ్వాలలతో సిద్దపడేముందు
కాస్త బుద్ధి దట్టించు!
గెలుపుని వోటమి కాటేస్తూ
అవమానపు పోట్లు పొడుస్తుందనీ
నాశనం చేసిన నమ్మకాన్ని
కాగిత శాసనం రాసి చెల్లిపోవాలంకుంటున్నావా?
ఓటమి అంచులో నిలబడి
నిన్ను గెలిపించుటలో ఒరిగిపోలేదు నీవాళ్ళు
కష్ట సుఖాల వారసత్వం కిలిగి నీవు
వాళ్ళ కోసం అన్ని భరించి
బోనస్ బతుకు అంకితం జేస్తే పరిపూర్ణం
పనిచేస్తూనే ఫలితమాశించు
కలల్ని కంటూనే సాకారం ఊహించు
అనుకున్నది జరుగకపోతే అవమానమనుకోకు
నేటి ఓటమి రేపటి మేలుకోలుగా
చిరకాల శత్రువులో చిరునవ్వులు కురిపించు
నీవు ఏది చేయలనుకున్న
ఒక నిమిషం ఆగి ఆలోచించు

15-2- 2014



# జనశాసనం

ఇల్లు అలుకనే లేదు పండుగ సురువైందా
అమాసపండుగ ముందు
పండుగ జేసుకోవడానికి నేత కోళ్లు
ముండ్ల మీద నిలబడి తన్నుకోవటానికి
వెన్ను వోంచుతున్నె ఉరుములై వర్షిస్తూ, హామీలై కురుస్తూ
జనప్రవాహపు వరదలై పొర్లుతున్నె
అన్నీ అణుకువగా మలుచుకొని గెలుచుకొవాలనీ
పాలనా జలగలు అవ్వాలని పాకులాడుతున్నె
రంకులమారి రాజకీయపు టైత్తుగడలు ఎగసిపడుతుంటే
ఏమిలేని విస్తరాకు ఎగురలేక సిగ్గుపడుతుంది.
అలుకుపూసిన జాగల గువ్వకూర్చున్న
గిల్టీ ఫీలింగ్ లేని పొలిటికల్ శివసత్తులు
పోట్లాడుకుంటూ శిగమూగుతున్నె
రంగేళి హెూళిలో వీరుల చితి బూడిద చల్లుకుంటూ
త్యాగాలన్నీ మరిపించే కుట్రలు
నెరవేరని ఆశయాలు
శవప్రమాణాల సాక్షిగా కమురు వాసన గోడుతున్నె
ఒంటిని కాగడగాపైకెత్తి
జ్వాలల నిప్పురవ్వల నినాదపు చౌరస్తా
గాల్లో గింగిర్లు కొడుతూ కూలిన దేహాన్ని
తలుచుకొని నింగిలోకి వేగుచుక్కకై వెతుకుతుంది.
వేలాడిన ఉరితాళ్ళగురి

వేగంగా పరుగెత్తిన చావు పందెం
ఒక్కొక్క బలియాగం గురుతుకొస్తే
గుండెల్ని మొండికత్తి కోస్తున్నట్టు కొసి మెలితిప్పుతది.
సబ్బండ వర్ణాలు సాధించిన అరవయేళ్ళ ఆకాంక్ష
తరతరాలకు పరువై నిలిచే మ్యానిఫేస్టో
జనమే జారీ చేయాలి
ఓటర్లే పోటీపడి నిలబెట్టాలి.

తేది: 03-03÷2014

**-సిద్దెంకి యాదగిరి**



# గెలిచిన కల

వతందారి నేలను వల్లకాడు జేసిన
ఆరున్నర దశాబ్దాల అక్రమ పాలనకి
ప్రజాక్షేత్ర స్మశానంలో
తల గొర్రాయి పెట్టింది
బతుకుల్ని చిదిమిన చరిత్రలో
రాలిన వేల పానాల పానాదుల సాక్షిగా
అమరులు అల్లిన సర్వగంప
పరువుతో నెత్తికెత్తుకొంది ప్రజాస్వామ్యం
ప్రజాకంటకం
దుర్మార్గపు ఏలుబడి దురంతం
దురాలోచన పేక మేడల్ని
కన్న తల్లుల కడుపుకోత శోక ప్రవాహం
పోరాట సునామి కెరటాలై
సమైక్యత ఇనుప సింహాసనాన్ని కూలదోసింది.
కాలం కత్తి కొన మీద కాంతిరేఖ నిలుప
అరువై తొమ్మిదిల వీరుల జీవార్పన నైద్యం
మలిదశలో వినిపించిన మరణ వాంగ్మూలాలు
రణ మృదంగ బలియాగాలు
‘జై తెలంగాణ’నినాదపు దేహ దహనపు జ్వాలలు
శిథిల చరిత్ర శకలాలై
రక్తాక్షరాలు ముద్రించిన బిల్లు
పార్లమెంటులో ప్రత్యేక రాష్ట్ర శాసనం

మోరపారకం మోసంతో
పంట గాసం పచ్చికను
ఫ్లోరోసిస్ వంకర్లు లేని బతుకులకై
దప్పిక గొంతుల్ని తడపని నీళ్ళు
దాహార్తి తలరాతల్ని మార్చేందుకు పరవల్లు దొక్కాలి
అమరుల ఆశయ సాధనలో అవినీతి రహిత భవితను
అసమానతలునలు లేని బహుజన ప్రజాస్వామ్య తెలంగానం
గెలిచిన కల బహుచక్కగ నిర్మించుకోవాలే

24-02-2014, ఆంధ్రజ్యోతి 'వివిధ' లో ప్రచురితం

-సిద్దెంకి యాదగిరి




తెలుగు అకాడమీ నిర్వహించిన 117వ జాషువా జయంతి ఉత్సవాలను
పురస్కరించుకొని జూబ్లీ హాల్‌లో 27-9-2012న ఆచార్య కొలకలూరి ఇనాక్,
ప్రొ॥ ఎండ్లూరి సుధాకర్‌ల గారిచే సన్మానం



సాహితి కిరణం, జి.వి.ఆర్. కల్చరల్ ఫౌండేషన్ మరియు
కళా సుబ్బారావు కళావేదిక సంయుక్త ఆధ్వర్యంలో నిర్వహించిన
ఉగాది కవి సమ్మేళనంలో కె.వి.రమణాచారి గారిచే సన్మానం (తేది: 27-3-2014)